# వృషనామ సంవత్సర _ ఆషాఢ - శ్రావణమాసములు

1941 సం॥ జూలై

| | | |
|---|---|---|
| 1 | మం | ష రా8.15 ఉఫ రా8.3 రావ4.1ల5.31వ ఉదు8.7 రాదు10.58 |
| 2 | బు | అ రా6.7 హస్త రా6.43 రావ2.15ల3.45వ పదు11.36 |
| 3 | గు | న మ3.48 చిత్త సా5.12 రావ10.27ల11.57వ తిథిద్వయం ఉదు9.53 మదు3.6 |
| 4 | శు | ద మ1.22 స్వా మ3.34 రావ8.48ల10.17వ ఏకాదశితిథి ఉదు8.8 మదు12.29 |
| 5 | శ | ఏ ప10.53 విశా మ1.53 సావ5.37ల7.7వ మత్త్రయ ఏకాదశి ఉదు7.16వ |
| 6 | ఆ | ద్వా ఉ9.28 అనూ మ12.17 సావ5.33ల7.13వ దినం 32.33 సాదు4.50 |
| 7 | సో | త్ర ఉ6.9 చతు తె3.56 జ్యే ప10.48 సావ6.23ల8.12వ పదు12.29 మదు3.5 |
| 8 | మం | ○ పూర్ణి రా2.3 మూ ప9.32ఉవ8.1ల9.30వరావ6.46ల8.18ఉదు8.9రాదు11.0 |
| 9 | బు | బపా రా12.34 పూషా ఉ8.33 సావ4.21ల5.55వ పదు11.37ల |
| 10 | గు | వి రా11.26 ఉషా ఉ7.56 పవ11.54ల1.29వ ఉదు9.54 మదు3.6 |
| 11 | శు | త రా10.48 శ్ర ఉ7.42 పవ11.45ల1.22వ ఉదు8.10 మదు12.30 |
| 12 | శ | చ రా10.38 ధని ఉ7.59 పవ3.25ల5.4వ దినం 32.28 ఉదు7.19వ |
| 13 | ఆ | పం రా11.6 శత ఉ8.43 మవ3.27ల5.8వ సాదు4.50 |
| 14 | సో | ష రా11.48 పూభా ఉ9.58 రావ8.18ల10.1వ మదు12.30 తిరి దు3.6 |
| 15 | మం | స రా1.9 ఉభా ప11.41 రావ12.46ల2.20వ ఉదు8.12 రాదు11.1 |
| 16 | బు | అ రా2.46 రేవ మ1.48 వర్జ్యములేదు కర్కాటకసంక్రమణము 11.48 పదు11.39 |
| 17 | గు | న తె4.44 అశ్వ మ4.14మవ11.49ల1.35వరావ2.54ల4.40వఉదు9.55మదు3.10 |
| 18 | శు | ద పూర్తి భర రా6.50 వర్జ్యములేదు దినం 33.22 ఉదు8.12 మదు12.31 |
| 19 | శ | దశఉ6.47 కృ రా9.27 ఉవ8.9ల9.55వ ఉదు7.21వ |
| 20 | ఆ | ఏ ఉ8.43 రో రా11.56 మవ3.4ల4.50వ మత్త్రయ ఏకాదశి సాదు4.49ల |
| 21 | సో | ద్వా ఉ10.26 మృ రా2.5 ఉవ6.2ల7.47వ పదు12.32 మదు3.6 [రాదు11.0 |
| 22 | మం | త్ర ప11.45 ఆర్ద్ర రా3.52పవ11.6ల12.49వ మాసశివరాత్రి చతుర్దశితిథి ఉదు8.13 |
| 23 | బు | చ మ12.40 పున తె5.6 సావ4.29ల6.10వ అమావాస్యతిథి పదు11.39 [3.5 |
| 24 | గు | ● అమా మ1.4పుష్యపూర్తిపవ1.23ల3.2వదినం32.14పాడ్యమీతిథిఉదు9.56మదు |
| 25 | శు | శుపా మ12.56 పుష్య ఉ5.46 సావ6.43ల8.20వ ఉదు8.4 మదు12.32 |
| 26 | శ | వి మ12.19 ఆశ్రే ఉ6.0 సావ5.54ల7.29వ ఉదు7.22వ |
| 27 | ఆ | త ప11.16 మఘ ఉ5.50 పుబ్బ తె5.16 మవ1.38ల3.12వ సాదు4.48ల |
| 28 | సో | చ ఉ9.46 ఉత్త తె4.17 మవ12.10ల1.42వ పదు12.32 మదు3.6ల |
| 29 | మం | పం ఉ7.58 హస్త రా2.57 మవ12.13ల1.42వ ఉదు8.14 రాదు11.0ల |
| 30 | బు | ష ఉ5.52 సప్త తె3.38 చిత్త రా1.29 పవ10.28ల11.58వ దినం32.5పదు11.39ల |
| 31 | గు | అ రా1.9 స్వా రా11.50 ఉవ6.42ల8.11వ తెవ5.5ల ఉదు9.57 మదు3.5 |

## ముఖ్య పండుగలు

6. శయనఏకాదశి. 8. వ్యాసపూర్ణిమ. 16. కర్కాటకసంక్రమణం, దక్షిణాయన ప్రారంభము, 29. సోమగోపాకర్మ మంగళగౌరీవ్రత ప్రారంభము.

# విషయసూచిక



త్రివర్ణచిత్రము: శ్రీమతి జయమ్మ, కన్నడ "సుభద్ర"




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

---

## అ॥ భా॥ మహిళామండలి సమాధానము

ఆంగ్లమహిళామణులు కొందరు యుద్ధ నిర్వహణార్థమై సర్వవిధముల సంపూర్ణముగా తోడ్పడవలయునని కోరుచూ భారత స్త్రీలకొక విజ్ఞప్తి చేసియుండిరను విషయము పాఠకు లెఱుంగనిదికాదు.

ఆ విజ్ఞప్తికి అఖిలభారత మహిళామండలి తరఫున శ్రీమతి సరోజినీదేవి, రామేశ్వరీ నెహ్రూ, శ్రీమతి విజయలక్ష్మి పండిట్, రాణీ లక్ష్మిబాయి రాజవాడి, శ్రీమతి రాధాబాయి సుబ్బరాయన్, అమ్ము స్వామినాథన్, రాజకుమారి అమృతకౌరు గార్లు సంతకములుజేసి ఈ క్రింది విధముగా సమాధాన మొసంగిరి.

"అ॥ భా॥ మహిళాసభ నిర్మింపబడి ఇప్పటికి 15 సం॥లైనవి. మా యభిప్రాయములతోబాటు ఈ సంఘమువారి అభిప్రాయములను కూడ మీకు తెలియజేయుచున్నాము.

మా భారతదేశ మెల్లప్పుడు బ్రిటిషువారి స్వాధీనములోనే యుండవలయుననియు, బ్రిటిషువారితోకలసి భారతీయులుకూడ తప్పని సరిగా యుద్ధరంగములో నిల్చి పోరాడవలయుననియు, దానికై భారతీయుల సలహాగాని అనుమతిగాని పొందనవసరము

లేదనియు బ్రిటిషువారి నిశ్చితాభిప్రాయమని బ్రిటిషు ప్రధానమంత్రి స్పష్టీకరించియున్నాడు. ఇప్పుడు సమరాంగణమున శౌర్యధైర్యసాహసములతో నిల్చి పోరాడుచున్న సైన్యమంతయు భారతదేశాక్రమణమునకై సిద్ధముచేయించిన సైన్యమేగాని వేరుగాదు. కాని ఈ భారత సైనికులకు ఇచ్చటి జాతీయోద్యమముతో ఆవగింజంత సంబంధమైనను కానరాదు. భారతదేశములోనుంచి యుద్ధమునకు వలయు ద్రవ్యముగాని తదితర సహాయముగాని బ్రిటిషువారు పొందుచున్నారంటే నిర్బంధముచేతనేగాని మనస్ఫూర్తిగా భారతీయుల యుద్ధకాంక్షచేగాదు.

ప్రజా స్వాతంత్ర్యంకోరే దేశములును బానిసత్వమును శాసించు దేశములును ఇరుకక్షులుగా నిలబడి ఢీకొనుచున్నవి. బ్రిటిషుసామ్రాజ్యానికి, నాజీ, ఫాసిస్టులకు జరుగుచున్న ఈ సంగ్రామముయొక్క ముఖ్యోద్దేశమేమంటే ఆసియాఖండ జాతులను అధోపాతాళమునకు క్రుంగదొక్కడమే. ఆసియాఖండ జాతులవారికి ప్రజాస్వాతంత్ర్యమనేది గుండుసున్న. భారతదేశానికి, ఆఫ్రికాదేశస్థులకు అసలు దాని వాసనేలేదనుట సత్యదూరము కాదు. వీరికొకవేళ స్వాతంత్ర్యమే వచ్చినట్లైతే వీరి స్వయంకృషివల్లనేగాని ఈ యుద్ధ ఫలితముగా నెప్పటికి కానేరదు. కాబట్టి ఈ రెండు తత్త్వాలు మాకసమ్మతములే. బ్రిటిషువారి సామ్రాజ్యతత్త్వముకూడ మాకు హితవుగాదు.

'సత్వంవద,' 'ధర్మంచర,' 'అహింసా పరమోధర్మః' అను మహావాక్యములే మాకు ప్రమాణములు. ఇట్టి తత్వములకు బద్ధులమైనవారము కనుకనే యుద్ధమునకుగాని జననాశనమునకుగాని విముఖులమై యున్నాము. బ్రిటిషు వనితలు గొప్ప స్వార్థత్యాగ పరాయణులని మీరు ప్రశంసించుచున్నారుగాని ఈ జననష్టము, ఈ రక్తపాతము, ఈ క్రౌర్యమువలదని మీ పురుషులను వారించినట్లైతే మీ త్యాగము సార్థకమై వాసియు వన్నెయు గాంచెడిది. అట్లుగాక వారితోపాటు మీరును రణరంగమున కురికి భీకర కృత్యములలో పాల్గొనుచున్నారనుట విషాదకరము.

బానిసత్వములో బడియున్న ఈ భారతదేశాన్ని బానిసాధికారులైన బ్రిటిషు వారికి సహకారము చేయవలెనని కోరుటెంత సమంజసమో? సంకెలతో బంధింపబడిన వాడు పనిపాటలు చేయుటెట్లు? బ్రిటిషువారు ధర్మ ప్రభువులను విఖ్యాతిబడయవలయునన్న మున్ముందు ఈ బానిసత్వమును తొలగ ద్రోయవలయును. మీ విజ్ఞప్తిలో మీరెంత నిష్కపటముగానుంటిరో మేముకూడ అంత నిష్కాపట్యముతోనే ఈ సమాధానమిచ్చుచున్నాము."

బ్రిటిషువారికి మనస్ఫూర్తిగా భారతదేశ సమస్యను పరిష్కారముచేయవలె నను సద్భావముండిన పక్షమున అ॥ భా॥ మహిళామండలివారు సూచించినపద్ధతినే యను సరించుట శ్రేయోదాయకము. ప్రస్తుత భారతదేశవైఖరి బ్రిటిషువారికి అసంతృప్తి కరమై నచ్చకపోవచ్చును. అంత మాత్రముచే లేనిపోని అపార్థములను కల్పించి కాంగ్రెసు ఉద్యమము హిట్లరిజమునకు సానుకూలమైయున్నదని వెల్లడి చేయుటెంత ధర్మ విరుద్ధము!

"తాలిమి తన్ను కాచును; ఎదిరిని కాచును" అను ఆర్యోక్తి ననుసరించి భారతీయు లిప్పటికిని అదురుబెదురులేక మంచి తరుణమునకు వేచియున్నారు. భారతమహిళా మణులు వచించిన ఈ సూక్తులు తాత్కాలికముగా బ్రిటిషుస్త్రీల మనస్సులకు ములుకులై నాటినను చిట్టచివరకు రెండు దేశములకు నిష్పక్షపాతముగా నిజమైనసేవయే చేసినారని బ్రిటిషువారు గ్రహించకమానరు.

ఈ సమాధానము తిలకించిన తర్వాతనైన భారతీయుల మనస్తత్వమును గ్రహించి బ్రిటిషు వనితామణులు తమ కర్తవ్యము నిర్వహించెదరని ఆశించుచున్నాము. పురుషులు ఆగ్రహించినపుడు స్త్రీలే వారిని అనునయవాక్యములచే శాంతింపజేసి విధివిహిత కార్యములకు త్రిప్పవలయును. ఏ దేశములోగాని ఏ కాలములోగాని స్త్రీలచే చక్క బడని కార్యమొక్కటియు కనబడదు. స్త్రీ శక్తిస్వరూపిణిగావున తలచిన కార్యము విజయవంతముగా సాధించగల చతురతగలది. కావున ఇట్టి విషమ సమయమునందు ఈ మానవ మారణహోమమును అరికట్టి దేశక్షేమమును, ప్రజాక్షేమమును స్థాపించు భారము బ్రిటిషు వనితాలోకముమీదనే ఆధారపడియున్నది. ఈ రహస్యమును గుర్తించు వారున్నారా?

"వింతసమస్య"కు జబాబు లింకను మాకు వచ్చుచుండుటచే అన్నియు కలిపి రాబోవు సంచికలో ప్రకటింపబడును. కారణములు నిరూపించి చక్కని జబాబులు వ్రాయువారికి గృహలక్ష్మి సంచిక ఒకటి ఉచితముగా పంపబడును. దీనిని పాఠకులు గుర్తింతురుగాక!

# నిజాం రాష్ట్ర ఆంధ్ర మహిళా మహాసభ

## అధ్యక్షురాలి ఉపన్యాసములోని సారాంశాలు

నిజాంరాష్ట్ర అష్టమ ఆంధ్రమహాసభతోపాటు జూను 4.వ తేదీన చిలుకూరులో జరుపబడిన మహిళా మహాసభకు శ్రీమతి రంగమ్మ ఓబలరెడ్డిగారు అధ్యక్షతవహించియుండి, మంచి ఉపన్యాసము ద్వారా చక్కని ప్రబోధము చేసియుండిరి.

శ్రీమతి రంగమ్మగారు చేసిన అధ్యక్షోపన్యాసములోని కొన్ని కొన్ని భాగములను మాత్రము, ఎట్టి వ్యాఖ్యయు విమర్శయు చేర్చవలసిన యవసరములేకుండ యిట పొందుపరచుచున్నాము. చదువరు లందరును సాలోచనాపూర్వకముగ యిందుగూర్చి మననము చేయదగును :—

ఇంకను ఆంధ్ర స్త్రీలలో మిగిలియున్న లోపముల నిట్లుదాహరించిరి: "అవిద్య, మూఢవిశ్వాస ములు, ఆత్మవిశ్వాసరాహిత్యము, అనారోగ్యము, ఆయుఃక్షీణత, సాంఘిక దురాచారములు, అత్యాచార ములు, దిక్కులేనితనము."

పరిష్కారమార్గము: "ప్రజలు విరివిగా స్త్రీల పాఠశాలలను స్థాపించవలసియుండును. ప్రభుత్వము వారు బాలికల విద్యావిషయములో ఉదారత చూపించవలసియుండును."

మాతృభాష ద్వారానే విద్యాభ్యాసము మేలనిరి.

"ఇప్పటి స్థితిలో భారతీయ స్త్రీలలో నూటికి 90 మంది సాంఘికముగాను, ఆర్థికముగాను పనికి రానివారై యున్నారు."

"సంఘసేవలో తమ జీవితమును సార్థకము చేయుటకు త్యాగముచేయ నొల్లరు."

కర్తవ్యము, విధులు: "మనము సొమ్ములపై తక్కువగ వ్యయము చేయవలెను. బిడ్డల పోషణపై ఎక్కువ వ్యయము చేయవలెను. మూఢవిశ్వాసాలను వెంటనే వదులుకోవలెను. ప్రతి గ్రామములో మంత్ర సానులను ఇప్పటికాలపు వైద్యపద్ధతులపై శిక్షణమిచ్చి సిద్ధముచేయవలెను. ప్రతి బాలికకును ప్రతి స్త్రీకిని వ్యాయామశిక్షణ మిప్పించవలెను. గృహకృత్యములను నిర్వహించుకొనుటలో ముఖ్యముగ నేర్పించవలసినవి:- మేలైన వంటలు చేయుట, ఏ కూరగాయలు ఆరోగ్యకరమైనవో తెలిసికొనుట, పాకమేది యుత్తమమో గ్రహించుట, ఇంటి ఆదాయ వ్యయముల లెక్క వ్రాసిపెట్టుట, ప్రాథమిక చికిత్సలు చేయుట."

"బాల్యవివాహాలను మానుకొనవలెను."

"శిశుపోషణ, రోగాల ఉపచార" విధులను బాగుగా తెలుసుకొనవలెను.

"శిశువులను ఆరోగ్యవంతులనుగా పెంచలేని తల్లి వారిని కనుటకును అధికారము లేనట్టిది."

"గృహపరిశ్రమలను విరివిగ స్త్రీలలో వ్యాపింపజేయుట."

ఉదాహరణము—సూచనలు: "వడుకుట, చేతికుట్లు, మిషనుకుట్లు, చిత్రలేఖనము, బొమ్మలు చేయుట, అల్లుట, నక్షీపనులు, మంచము నవారులు జంఖానాలు ఖాదర్లు నేయుట, అగ్గిపెట్టెలు చేయుట, రంగుల అద్దకపు పనులు, నెయ్యిచేసి అమ్ముట, గాజులు వేయుట (తొడుగుట)."

ఆదర్శవివాహము "అవిచ్ఛిన్నమును, వ్యాపారయుక్తము కానట్టిదియును, విడాకుల నపేక్షించ నట్టిదియును, కామప్రధానము కానట్టిదియు" నని వర్ణించిరి.

"శుల్కాలనుగురించి కన్యా వరవిక్రయములను చేయువారికి సిగ్గువచ్చునట్లు సంఘాభిప్రాయమును బలపరచుట కందరును తోడ్పడవలెను. వృద్ధుడై మూర్ఖుడైన ధనికునికి కన్యనిచ్చుటకు మారుగా సాధారణ జీవియు బుద్ధిమంతుడును అయిన బీదవానికిచ్చుటే శ్రేయస్కరము."

"మనము బీదస్త్రీల జీవనస్థితులను విచారించుకొని వారి నుద్ధరించకుండిన, సంఘసేవ చేసిన వారము కాజాలము."

అనాధలగు స్త్రీల కొఱకును, వ్యభిచారవృత్తినుండి రక్షింపబడవలసియున్నవారికిని "మంచి పద్ధతులపై సేవాసదనములో శరణాలయములో ఏర్పాటుచేయుట చాల అవసరము."

నైజాంలో "బాల్యవివాహ నిషేధశాసనము అగువరకు మనము మన ఆందోళనమును ఏమాత్రమును తగ్గించుకొనరాదు."

"పర్దాను (ఘోషాపద్ధతిని) వెంటనే వదలుకొనవలె"నని కోరిరి.

"ప్రతి గ్రామములోను శిక్షణపొందిన మంత్రసానులుండవలెను. ప్రతి తాలూకాలోను ఒక ప్రసవశాల యుండవలెను. అందు స్త్రీ డాక్టర్లే యుండవలెను."

యూరోపియనులనుండి నేర్చుకొనవలసిన ఉత్తమగుణములు: "పట్టుదల, శ్రద్ధ, దేశభక్తి, త్యాగము, విజ్ఞానము, విద్యాప్రాభవము, ఆరోగ్యము, పరిశుభ్రత, శిశుపోషణము."

మన ప్రాచీనుల ఆధిక్యము: "మన ప్రాచీన భారతీయ స్త్రీలు విదుషీమణులై యుండిరి. కవులై యుండిరి. గొప్ప వీరనారీమణులై యుండిరి. తేరిచూడజాలనట్టి పతివ్రతలై యుండిరి....ఒకకాలములో రాజపుత్ర స్త్రీలును ఆంధ్ర మహారాష్ట్ర స్త్రీలును వీరవనితలై యుద్ధములందు పాల్గొని శౌర్యమును ప్రకటించి ఆత్మగౌరవమును సంఘగౌరవమును కాపాడియుండిరి."

తర్వాత, "మత కలహాలు చెలరేగిన కాలములలో స్త్రీల గౌరవాలు దక్కుట దుష్కరమై పోయినది."

"స్త్రీలను బలాఢ్యలనుగ జేసి, ఆత్మరక్షణమును చేసుకొను స్థితిలో నుంచుట చాల అవసరము. స్త్రీలకు సాము నేర్పింపవలెను."

ఈ సభకు ఆహ్వానసంఘాధ్యక్షురాలయిన శ్రీమతి పులిజాల కమలాబాయిగారి స్వాగతోపన్యాసమున, మహిళా ఉద్యమాన్ని స్త్రీలే నడిపించవలసియున్నదని హెచ్చరించిరి. స్వాతంత్ర్యము ప్రతి మనిషికి జన్మహక్కని జ్ఞాపకముచేసిరి. స్వయమాధారబుద్ధిని ఆత్మావలంబనమును నేర్పునట్టిదే నిజమైన విద్యయని వక్కాణించిరి.

ఈ మహిళాసభలోని ప్రసంగములు, చర్చలు, తీర్మానములును ఫలప్రదములై ఇతోధికముగ స్త్రీలలో జాగరణమును చైతన్యమును అభ్యుదయమును చేకూర్చుటకు తోడ్పడునుగాక యని కోరెదము!

---

# "స్వర్గీయ సుగుణమణి"

శ్రీమతి వడ్డాది మీనాక్షమ్మ

"గృహలక్ష్మి" పత్రికతో పరిచయముగల వ్యాసరచయిత్రి అడపా సుగుణమణి యిరువదిరెండు వత్సరముల ప్రాయముననే కాలగర్భమున కలసిపోయినది. మూర్తీభవించిన ఈ శాంతమూర్తి కన్నుగవకిక కాన్పించదు; అమృతతుల్యమగు నీమె వాగ్ధోరణి వీనులకిక విన్పించదు; ఉత్సాహపూరితములగు ఈమె రచనలిక పత్రికామాలమున పఠితల కరముల చేరవు.



సుగుణమణి కీ॥ శే॥ కసిరెడ్డి అప్పారావు నాయుడుగారి జ్యేష్ఠపుత్రిక. మేనమామ శ్రీ అడపా సత్యనారాయణరావుగారి ధర్మపత్ని. ఈమె జన్మస్థలము శ్రీకాకుళము; వర్ణమున తెలగ. ఈమెకు తొలిచూలు సుతుడును, మలిచూలు సుతయు సంతతి. తోబుట్టువులు మువ్వురు భగినులు. భ్రాతలు లేరు. పంచవర్షముననే ఈమెకు పితృవియోగము సంభవించినది. ఈ అభాగ్య సోదరికి అక్షరాభ్యాసముతో బాటు సోదరీమణులను, భర్తృహీనయగు మాతృదేవతను, వెనువైచుకొని తాతగారగు శ్రీ అడపా వరహానరసింహస్వామిగారి యండను దారి తెన్నులేని సంక్షోభసాగరమున నీదవలసి వచ్చినది.

పాఠశాలలో నీమె చదువుకొనినది మూడవఫారమువరకు మాత్రమే. స్వయంకృషి, మేధాశక్తుల పటిమచే జ్ఞానాభివృద్ధి గావించుకొనినది. వయస్సును మించిన ప్రతిభ, కాలమును మించిన భావములు, శక్తికి మించిన సాహసము, పెద్దలను గౌరవముతో వంచగల నేర్పు ఈ సార్థకనామధేయకు వెన్నతో బెట్టిన విద్యలు. ఈమె కంటబడిన పొత్తముల విమర్శనాదృష్టితో పఠించనిదే విడుచునదికాదు. కాలమును అనవసరపు ప్రసంగములతో వ్యర్థపుచ్చుటయన నీమె కేవగింపు. రంగవల్లు లలంకరించుట, లేసు అల్లికలువేయుట యన నీమెకు మిక్కిలి యభిమానము. జ్యోతిష సాముద్రిక శాస్త్రములలో నీమెకు ప్రవేశము గలదు.

గృహకృత్యముల నెరవేర్చుకొని, బిడ్డలకు శుశ్రూషయొనర్చి మిగిలిన తీరిక సమయములలో నీమె వ్యాసముల రచించుచుండెడిది. ఈమెకు వ్యాసరచనలోనున్న శ్రద్ధ, శుభ్రప్రతివ్రాసి ప్రచురణకై పత్రికలకు బంపుటలో లేదు. ఈమె వ్రాసిన "ఆర్తవఫలముల అయోమయము", "రాధావధూటి", "పాండవులెవరు?" మున్నగు వ్యాసములు, పెక్కు కథలు "గృహలక్ష్మి"లో ప్రకటితములైనవి. ఇంకను శుభ్రప్రతి వ్రాసి ప్రచురణకై పంపుటకు కొన్ని మిగిలియున్నవి. వాటిని వీరి బంధువులు జాగ్రత్తపరచి ప్రచురణకై "గృహలక్ష్మి" కార్యాలయము జేర్చి రచయిత ఆశయమును నెరవేర్తురని ఆశించుచున్నాను. ఈమె ఏప్రిలు 18వ తేదీని అకాలమృత్యువాత బడినది. ఈమె అకాల మృత్యువునకు క్రుంగి కృశించుచున్న ఆప్త బంధుమిత్ర వర్గమునకు నా హృదయపూర్వక సానుభూతి.

అస్తమించిన అడపా సుగుణమణిగారి ఆత్మకు భగవంతుడు శాంతిని ప్రసాదించుగాత!

## స్వర్గీయ సుగుణమణిగారు

సార్థక నామధేయయగు స్వర్గీయ సుగుణమణిగారు అనుంగుబిడ్డల నిద్దరిని ప్రియ భర్తను శోక సాగరమునముంచి ఇరువదిరెండు సంవత్సరముల ప్రాయముననే స్వర్గస్థురాలైనదనుట మిక్కిలి విషాదకరము. ఈమె ఆంధ్రభాషయందు మంచి ప్రవేశముగలిగి వ్యాసరచనా వ్యాసంగమున మిక్కిలి కుతూహలము చూపుచుండెడిది. ఈమె రచించిన వ్యాసరాజము లనేకములను మా గృహలక్ష్మి ప్రచురించి ధన్యతగాంచినది. సారస్వత లోకమునకు పుష్టిని గూర్పగలిగిన ఇట్టి విదుషీరత్నముల అకాలమరణముచే భారతమాత కొక లోటనియే చెప్పవచ్చును. ఈ యమ బడిలో 3వ ఫారమువరకే చదువుకొన్నను ఆంధ్ర భాషాభిమానముచే స్వయం కృషిచేసి చక్కని రచనానైపుణి గాంచినది. అంతయే గాక లేసులల్లుట, ఎంబ్రాయిడరీ మొదలగు చేతిపనులయందును ఈమెకు నేర్పుగలదు. ఈమె కుటుంబమునకు సానుభూతిని తెలుపుచూ వీరి ఆత్మకు పరమేశ్వరుడు శాంతి నొసంగుగాకయని కోరుచున్నాము.

# నిజాంరాష్ట్ర మహిళాసభా తీర్మానములు

జూను 3, 4, 5, తేదీలలో ఎనిమిదవ నిజాంరాష్ట్ర ఆంధ్రమహిళాసభ నల్లగొండజిల్లా చిలుకూరులో సుప్రసిద్ధ సంఘ సేవకురాలయిన శ్రీ రంగమ్మ ఓబలరెడ్డి సతిగారి అధ్యక్షతక్రింద జరిగింది. ఈ క్రింది సారాంశములుగల తీర్మానములు ఆమోదింపబడ్డవి:—

ప్రభువుగారి ప్రియమాతగారి మరణమునకు, ప్రధానామాత్యుల భార్య లేడీ హైదరీగారి మరణమునకు, సంఘ సేవకురాలయిన కే. సుశీలాదేవిగారి మరణమునకు విషాదము వెల్లడించారు.

స్త్రీలకు ఉన్నతవిద్య మాతృభాషల్లో ప్రవేశపెట్టవలెననీ, ఉర్దూ నిర్బంధం తొలిగించవలెననీ, స్వంత పాఠశాలలమీద నిరోధము తొలిగించవలెననీ కోరినారు.

బాల్య వివాహశాసనము ఓడిపోయినందుకు విచారించి ప్రజలను ప్రౌఢా వివాహములు చేయుటకు, బహు భార్యాత్వము, కన్యావరశుల్కములు, వృద్ధవివాహములు, దీర్ఘ వయోభేదము, దుబారాఖర్చులు, మొదలైనవి సంస్కరించవలెనని కోరినారు.

భర్తలు ద్వితీయవివాహము చేసుకున్నప్పుడు పతిపరిత్యక్తలైన ఆ భార్యలు తిరిగీ వివాహమాడ వచ్చుననీ, ప్రభుత్వమువారు వానిని అంగీకరించవలెననీ కోరినారు.

స్త్రీలకు వారసత్వాధికారము, వితంతువుల హక్కులు, బ్రటిష్ ఇండియాలో మాస్తరుగా కావలెననీ, స్త్రీలుగూడా స్వావలంబన పద్ధతిని ధనం సంపాదించవలెననీ కోరారు.

గ్రామాలల్లో ఉచిత వైద్యాలయాలు ఎక్కువగా స్థాపించవలెననీ, శిక్షణబొందిన మంత్రసానులను ఏర్పరచవలెననీ కోరారు.

గృహపరిశ్రమ కేంద్రాలను, వ్యాయామశాలలను, మహిళా సంఘాలను, అనాధాలయాలను విరివిగా స్థాపించవలెననీ, అస్పృశ్యతను మద్యపానమునూ నిర్మూలించవలెననీ, ఆడపాపల (బానిసలు) పద్ధతినీ, ఘోషాపద్ధతినీ తొలగించవలెననీ కోరారు.

# ఆంధ్రదేశంలో భారత మహిళా సభ

అఖిలభారత మహిళా మహాసభ స్థాయిసంఘ సభ్యురాలు శ్రీమతి బి. కామేశ్వరమ్మగారు ఈ క్రింది ప్రకటన గావించుచున్నారు:—

" రాబోవు అఖిలభారత మహిళా సమావేశము క్రిస్టమస్ సెలవులలో ఆంధ్ర దేశములో జరుపుటకు నిశ్చయించినారు. శ్రీమతి విజయలక్ష్మి పండిట్ అధ్యక్షత వహించెదరు. ఆంధ్రదేశమున ఈ సమావేశము జరుగుటకు ఇదియే ప్రథమము కాబట్టి సోదరీమణులెల్లరు ఇప్పటినుంచి దీక్షవహించి ఆ సభ జయప్రదముగా జరిగించవలెనని నా ప్రార్థన. ప్రతివూరిలోను స్త్రీల సమావేశములు జరిపి మహాసభకు అధికసంఖ్యగా స్త్రీలను సభ్యులుగా చేర్పింపవలెను. ఏ జిల్లాలో జరుగునది రాష్ట్ర సంఘంవారు త్వరలో సమావేశమై తీర్మానించెదరు. "

# నిత్యావసరములలో ఒకటి




మీ భర్త పనినుండి, మీ పిల్లలు బడినుండి, యింటికి రాగానే వారికి టీ తయారుచేసి యిచ్చుట మీ విధి. కాబట్టి ప్రతి రోజు మీ యింట్లో టీ పార్టీ అన్నమాట—సంసారఆనందమునకు ముఖ్య మిదియే. మీ యింటిలో వలెనే అనేక యిండ్లలోకూడా అదే విధముగా యిదే సమయమున యీలాటి సంతోషకర విషయమే జరుగుచున్నదని నమ్ముడు!

## మనము ఇండియా టీ సేవింతాగుదము



తేనీరు తయారుచేయు విధం—మంచినీటిని మరుగ కాచవలయును. పరిశుభ్రమైన పాత్రను కొద్దిగా వెచ్చజేయుడు. మనిషికొక చెమిచా చొప్పున, ఎంతమందికి తేనీరు కావలయునో అన్ని చెమిచాల తేయాకుతో, మరొక చెమిచా తేయాకు ఎక్కువగా చేర్చి ఆ పాత్రలో వేయుడు. కాగుతున్న నీరు సలసల మరుగగానే ఆ నీటిని ఆ తేయాకు పాత్రలో పోయుడు, అయిదు నిమిషములు అట్లుండనిచ్చి, ఆ తేనీరును కప్పులలోపోసి, పాలను పంచదారను కలిపి సేవించుడు.

ఇండియన్ టీ మార్కెట్ ఎక్స్‌పాన్షన్ బోర్డువారిచే ప్రకటించబడింది

I K 116

# "స్టార్లు"

## ఉల్లాసంకొరకు ఉత్సాహంకొరకు తేనీరుమీదే ఆధారపడుతారు.

ఇండియా దేశపు "ఫిల్మ్ స్టార్లు" ఇతరదేశముల స్టార్లవలెనే తేనీరుమీదనే ఆధారపడుతారు. వారి కది యిష్టం. అవసరంకూడాను. వారి జీవనమే కష్టపాటు జీవనము. ఒక్కొక్కప్పుడు వేళాపాళా యును నిసబుకూడాలేకుండా గంటలకొలది వారు స్టూడియోలలోనే కాలము పుచ్చవలసివస్తుంది. అందువల్ల వారి దేహాలు సొలసిపోవును. బుద్ధి అలసిపోవును. దీనికి పరిహారముగా వారు సాధ్యమైనంత తరుచుగా వేడివేడి తేనీరు విస్తారం త్రాగుచూ ఉంటారు. ఇండియన్ 'స్క్రీన్' మీద యెంతో ప్రఖ్యాతిని గణించిన తారలు ఈ దిగువ వివరించినప్రకారం తేనీరు తమకు కల్గించినశక్తిని, ఉత్సాహమునుగురించి యేకగ్రీవంగా ప్రశంసిస్తున్నారు:-

డైరెక్టరు పి. సి. బరువా కొత్తగా "శాపముక్తి" అనే విషాదాంత నాటకమును చిత్రంగా తీశాడు. అందులో ఆయన ప్రధానపాత్రధారిగా నటించినాడు. ఆ చిత్రమును తీయబోయేముందు ఆయన ఇట్లు అన్నాడు. "ఆహా! ఒక్క కప్పు టీ తప్పనిసరి గదా! పానీయములన్నిటిలో నేను మొట్టమొదట మోహించినది తేనీరు. నేను అన్ని సందర్భములలోను అన్ని గంటలలోను అది త్రాగుతాను. తీయని తేప కూర్చుటలోను, కమ్మని శక్తినిచ్చుటలోను ఒకకప్పు తేనీటికి సాటి వేరొకటిలేదని నా అభిప్రాయం. నాకెప్పుడు చదువుకోవాలనితోచినా విశ్రాంతి తీసుకోవాలనీ ఆనందం అనుభవించాలని కోరికపుట్టినా నేనడిగేదల్ల ఒక్కటే, నా ప్రక్కను ఒక చిన్న "టీ పాట్" వుంటే చాలును."

ఇండియన్ ఫిల్మ్ స్టార్లలో మొదటి వరుసకుచెంది ప్రజలందరి మెచ్చుకోలుకు పాత్రమైన జమునా దేవి: "శరీరమునకు తేప కూర్చుటకు ఒకకప్పు టీ వంటిది వేరొకటిలేదు. నిజంగా ఉత్సాహమును కూర్చేది తేనీరే."

ఇండియా దేశములోని ప్రేక్షకులందరికి ఇలవేల్పై రాణిస్తూ గాయకశిఖామణి అని పేరుబడ్డ కే. యల్. సైగాల్ "నేను తేనీటినెందు కంత ప్రేమిస్తున్నానో మీకు చెప్పెదను. ఎందుకంటే పాటకు నటనకు, సంతోషకరమైన సకలకార్యములకు, అది నన్ను పురికొల్పుతుంది, నన్ను పాడాలని కోరేముందర ఓకకప్పు తేనీరివ్వండి" అన్నాడు

♦ ♦ ♦ ♦

సుప్రసిద్ధ బెంగాలీస్టార్ ఛాయాదేవి తేనీటి సుగుణాలను గురించి తత్తుల్యంగానే నొక్కి చెప్పుచున్నది. "దాహము తీర్చుటకు, నరములకు బిగువుకూర్చి ఉల్లాసమును ఘటించుటకు తేనీరు చాల సంతృప్తికరంగా పనిచేస్తుందని నేను తెలుసుకున్నాను. మిక్కిలి ఉద్రేకంతో నేనొక పాత్రను నటించిన తరువాత ఒకకప్పు టీ ఉంటే చాలును. నాకు మరేమి అక్కర్లేదు."

ఇప్పుడు ఫిల్మ్ ప్రపంచంలో వాసి కెక్కుచున్న యువకరత్నమగు రోమోలాదేవి ఇదే అభిప్రాయమును ప్రతిధ్వనించుచున్నది:

"స్టూడియోలో మిక్కిలి శ్రమపడి పనిచేసిన తరువాత నేనెంత సొమ్మసిల్లి వున్నను, ఒక్కకప్పు టీ త్రాగేసరికి నా కెక్కడలేని చురుకుదనం వస్తుంది. నేను తిరిగి సంపూర్ణశక్తితో పని చేయుటకు సిద్ధపడగలను."



# ★ రాజముకుటం

రచయిత :
శ్రీ గోవిందవల్లభపంతు

అనువాదకర్త :
శ్రీ పురాణం కుమారరాఘవశాస్త్రి

## ముందు కథ

రణజిత్తు కమల్ మీరువెళ్లి భిక్షుకుని వేషములో ఉదయుని సంగతంతా తెలుసుకొంటాడు. ఒకరోజు ఉదయుడు ఒంటరిగా ఉండే సమయం కనిపెట్టి వానివద్దకు పాడుకొంటూవచ్చి కటారితో పొడువబోతాడు. అంతలో బహదూర్‌సింగు వచ్చి ఉదయుని రక్షిస్తాడు. తర్వాత బైరాగియైయున్న జయసింహుడుకూడ వచ్చి పన్నా ఉదయులను కలుసుకొంటాడు. వీరందరు కలిసి కమల్ మీరు ప్రభువుతో ఆలోచించి వనవీరునిపై దండెత్తడానికి సిద్ధపడతారు.

### పాత్రలు

| | | | |
|---|---|---|---|
| 1. | వనవీరుడు | ... | శీతలసేని పుత్రుడు |
| 2. | శీతలసేని | ... | వనవీరుని తల్లి |
| 3. | ఆశాశాహుడు | ... | కమల్ మీరు ప్రభువు |
| 4. | బహదూర్‌సింగ్ | ... | పన్నా భర్త |
| 5. | ఛందావత్ | ... | ఒక సర్దారు |
| 6. | రణజిత్ | ... | ఒకలోభి సర్దారు |
| 7. | జయసింహుడు | ... | ప్రధానమంత్రి పుత్రుడు |
| 8. | పన్నా | ... | ఉదయుని దాది |

ఇక చదవండి

## తృతీయాంకము

### దృశ్యం ౫

[యుద్ధక్షేత్రం వనవీరుడు, శీతలసేని ప్రవేశిస్తారు.]

వనవీర్ :-నువ్వీ భయంకర యుద్ధక్షేత్రంలోకి ఎందుకొచ్చావమ్మా? మూడు రోజులనించీ నేను ఓడిపోవటమే సంభవిస్తున్నది. ఇప్పుడు కేవలం ఒక పిడికెడు సైన్యం మాత్రమే నా పక్షాన ఉంది. ఇవాళ తప్పకుండా ఏదో నిర్ణయమౌతుంది.

శీతలసేని :-విచారపడకు. విజయము నిన్నే వరిస్తుంది.

వనవీర్ :-ఒకప్పుడు నేనూ అలాగే భావించాను. కాని అది పొరపాటు. నాకు విజయంకలగటం అసంభవం, నేను బాగా ఎరుగుదును. అయినా యుద్ధంచేస్తాను; అంతకంటే గత్యంతరం లేదు కదా! లేక శస్త్రం పారేసి, నీళ్ళు నమలుతూ, ఉదయుని శరణు వేడుకోమంటావా? అందుకైనా కాలం మించిపోయింది. [తెరలో రణవాద్యాలు] విన్నావా? అవిగో నా సైనికుల రణవాద్యాలు. సైన్యం వస్తోంది. నేనిక వెళ్ళాలి. నువ్విక్కడెందుకు? ఇక కాసేపులో భయానక చిత్రవధ జరుగబోతుంది. వెళ్ళిపో అమ్మా!

శీతల :-నీ క్షేమసమాచారం తెలీక వ్యాకులపడి వచ్చాను. ఇక వెళుతున్నాను.

[వనవీరుడు నిష్క్రమిస్తాడు]

ఊహుం వెళ్ళను. నా ప్రాణాలు వనవీర్ కోసం తహతహలాడిపోతున్నై. ఇక్కడే ఉంటాను. [ఒక చెట్టుకేసి చూపుతూ] ఈ చెట్టెక్కి యుద్ధగతి అవలోకిస్తూ ఉంటాను. అవసరమైతే నేనూ శస్త్రం పడతాను. [వనవీరుని నాయకత్వంకింద కొంతసైన్యం ప్రవేశించి, నిష్క్రమిస్తుంది. తరువాత రణవాద్యాలు. అనంతరం ఉదయసింహుడు, జయసింహుడు, బహదూర్‌సింగు, ఆశాశాహ్, ఛందావత్ సర్దారు, పాడుతూ ప్రవేశిస్తారు]

ఉదయుని సైన్యగీతిక

అర్పించు సైనికా! తను ధనములు!

౧

రక్తప్లుత భీషణ రణసీమన్
మోహము చొరనీకుము చిత్తమునన్,
కత్తియాడనీ రిపుకంఠములన్,
ధర్మముకొరకే జీవనములు!

౨

భయపడబోకుము రిపుసంతతికిన్,
క్షయమౌ వారల సర్వశక్తులున్,
జన్మభూమికీ జయ జై యనుచున్,
ప్రతినదింపుమీ త్రిభువనములు!

[గీతిక సమాప్తిచేసి ఆశాశాహ్, బహదూర్‌సింగు, ఉదయసింహుడు, ఛందావత్ సర్దార్, జయసింహుడు, తప్ప మిగిలినవారంతా నిష్క్రమిస్తారు]

ఆశాశా :-మన సైన్యమంతా నాల్గుభాగాలు చేశాం. తూర్పుదిక్కున అంత భయపడవలసిన యవసరమేమీ లేదు. ఈరోజున అక్కడయుద్ధం. సామాన్యంగానే ఉంటుంది. బహదూర్‌సింగ్! నీవు ఉదయుని ఏనుగుతో వెంట ఉండి, ఆయన్నూ మేవాడ్‌జండానూ రక్షిస్తూఉండు.

బహదూర్ :-మంచిది. పన్నాకోరికకూడ అదే.

ఆశాశా :-చందావత్ సర్దార్! మీరు పశ్చిమసైన్యానికి నాయకత్వం వహించండి.

ఛందావత్ :-చిత్తం.

ఆశాశా :-జయసింగ్! నేను ఉత్తరానికీ, మీరు దక్షిణానికీ, మన-మన సేవలను నడుపుకుంటూ వెళుదాం. ఈ విధంగా వనవీరునీ, అతని శేషితసైన్యాన్నీ నాల్గువేపులనుంచీ ముట్టడించగలం. పదండి, తొందర చేద్దాం.

[‘ఏకలింగ భగవాన్‌కీ జై’అని పలుకుతూ అందరూ నిష్క్రమిస్తారు. తెరలో రణవాద్యధ్వనులు. గాభరాగా రణజిత్తు ప్రవేశిస్తాడు]

రణజిత్తు :-ఇవాళ ప్రాణాలు నిల్చేట్టులేదే! వ్యర్థంగా ఈ ఆపదంతా నేనే కొనుక్కు తెచ్చుకున్నాను. ఇంతమంది సర్దార్లు వనవీరుడినుంచి ముఖం తప్పించి వెళ్ళిపోయారు. నేనూ అలాగేచేస్తే బాగుండి పోయేదే! ఏం చేస్తాడేమిటి వనవీరుడు? ఇప్పటికైనా మించిపోయిందా?

[జయసింహుడు ప్రవేశిస్తాడు]

జయ :-ఆగు-ఆగు! పాపీ! నీవు వనవీరుడికికూడా విశ్వాసపాత్రుడివికావు. అతడిప్పుడాపత్తులో తలమునిగి వుంటే, నీవు యుద్ధం చేయకుండా ఈ మూలవచ్చి దాక్కున్నావా?

రణజిత్తు :-దాక్కోలేదు. మీతో కలసి మీ పక్షాన యుద్ధం చేయాలనుకుంటున్నాను.

జయ :-ఛండాలుడా! నీవు పిరికిపందవే కాదు, స్వామిద్రోహివికూడాను. నీ కోసమే వెదకుతున్నాను; కత్తి తియ్యి!

రణజిత్తు :-ఎందుకు?

జయ :-క్షత్రియకులంలో పుట్టి, యుద్ధక్షేత్రంలో నిల్చి, కత్తి యెందుకని అడుగుతున్నావా? నేను కేవలం నిన్ను సంహరించేందుకే యుద్ధభూమిలో అడుగుపెట్టాను.

రణజిత్తు :-నేను నీకే మపరాధంచేశాను? వనవీరుడికి మిత్రుణ్ణవడమేనా?

జయ :-నీవు మహారాణా విక్రమునికికూడా మిత్రుడివే. నిన్నిప్పుడు ప్రాణాలతో విడిచిపెడితే మహారాణా ఉదయునికికూడ మిత్రుడివైపోగలవు. ఈ సమస్త రక్తపాతానికీ నీవే మూలకారణం. కత్తితియ్యవేం? నువు బ్రతికియుండకూడదు.

రణజిత్తు :-ఇదిగో తీస్తున్నాలే. కాచుకో దెబ్బ! యుద్ధక్షేత్రంలో మహా ఉపదేశాలు మొదలుపెట్టావు. దురభిమానీ! కానీ!

[ఇద్దరూ కత్తులతో యుద్ధంచేస్తారు. రణజిత్తు గాయపడి నేలకొరిగిపోతాడు]

జయ :-పిరికిపంద! ఇచ్చకాలపోతు! చచ్చావు. [పోబోతాడు]

రణజిత్తు :-ఆగు-ఆగు! ఈ రహస్యాన్ని నాతో కూడా పట్టుకెళ్ళాలని లేదు నాకు.

జయ :-ఏ రహస్యాన్ని?

రణజిత్తు :-[శీతలసేని లిఖితపత్రాన్ని ఇచ్చి] తీసుకో. యుద్ధానంతరం వనవీరుడు బ్రతికివుంటే అతని కందజెయ్యి.

జయ :-ఏమిటిది?

రణజిత్తు :-నా ప్రధానమంత్రిపదవి. చివరకు నాకది లభించనేలేదు. దానికోసమే నీతండ్రిగారిని హత్యచేశాను.

జయ :-నీవేనా ఇన్నాళ్ళూ దాగియున్న నా పితృ హంతకుడివి? ఇప్పుడిక నీకేమిదండన యిచ్చేది? పో, ప్రతిఫలం పొందావులే.

రణజిత్తు :-[క్షీణస్వరంతో] క్షమించు; క్ష-మిం-

[రణజిత్తు మరణం]

జయ :-క్షమించాను; సుఖంగా నిద్రపో.

[ఈ సమయాన చెట్టుకొమ్మ శీతలసేనిబరువుకు విరిగి పడిపోతుంది. కొమ్మతోపాటు శీతలసేని కింద బడుతుంది.]

ఈ చెట్టుకొమ్మ విరిగిపడ్డదే! దీనికింద ఎవరో స్త్రీ అణగిపడి ఉందే! అభాగిని! చచ్చిపోయిన ట్టుంద్ధి, పాపం! [తెరవేపుచూచి] శత్రుసేనవచ్చి పడుతోంది; వెళ్ళాలి. (నిష్క్రమిస్తాడు)

[ఇరుపక్షాల సైనికులూ కొందరు యుద్ధంచేస్తూ ప్రవేశించి నిష్క్రమిస్తారు]

[ఆశాశాహ్, వనవీర్—ఇద్దరూ కత్తులతో యుద్ధంచేస్తూ ప్రవేశిస్తారు. అప్పుడే బహదూర్ సింగుకూడా ప్రవేశం]

బహదూర్ :-ఆగు-ఆగు! నా పసికుర్రను మింగివేసిన పాపీ! నిన్ను సంహరించటం నావంతు.

[ఉదయసింహుడు ప్రవేశిస్తాడు]

ఉదయ:-కాదు కాదు, పెదనాన్నగారూ! ఇతన్ని నేను వధిస్తాను. ఇతడు నా తమ్ముడు చందన్‌నే కాక, మహారాణా విక్రమసింహుని కూడ చంపాడు.

[అప్పుడే పన్నాకూడ ప్రవేశిస్తుంది]

పన్నా:-శాంతించండి. అపకారికి తిరిగి అపకారమే చేయటం ఉచితంకాదు. వనవీర్‌ను వధిస్తే విక్రమ సింహరాణా తిరిగివస్తాడా? చందన్ బ్రతికి వస్తాడా?

[వనవీర్ కత్తిపారేసి యుద్ధం మానేస్తాడు]

వనవీర్ :-ఇప్పుడీ కత్తిమీదకూడా నా కాశయేమీ లేదు. మీరందరూకలిసి నన్ను వధించండి.

పన్నా:-వద్దు. వనవీర్ చావకూడదు. అతన్ని బంధించండి.

ఉదయ:-అమ్మ ఆజ్ఞ శిరోధార్యం సైనికులూ, వనవీర్‌ను బంధించండి!

[ఇద్దరు సైనికులు వచ్చి వనవీర్‌ను బంధిస్తారు. ఒకవేపునుంచి జయసింహుడు, మరొకవేపునుంచి ఛందావత్ సర్దారు ప్రవేశిస్తారు]

జయసింహుడు:-శత్రుసైన్యమంతా పరాజితమై పోయింది.

ఛందావత్ :-చిత్తోడుకోట ప్రవేశించటానికిక ఆటంకమేమీ లేదు.

అందరు:-జై మేవాడ్ మహారాణాకు జై! [అందరూ వెళ్లిన తర్వాత చివరకు పాదుక్లు పీలుస్తూ బహుదూర్ సింగు వెళుతాడు.]

[తెరపడుతుంది]

## దృశ్యము ౬

[పట్టాభిషేకం. సింహాసనంమీద ఉదయసింహుడు. బహుదూర్ సింగు, ఆశాశాహ్, ఛందావత్ సర్దారు, జయసింహుడు మొదలైనవారు వారివారి ఆసనాలమీద. రాజమకుటం పట్టుకుని పన్నా నిలువబడి ఉంటుంది.]

పన్నా:-ఇవాళ సుదినం. ఇదిగో చిరకాలంనుంచి అపేక్షిస్తోన్న రాజమకుటం. ఇది నీ మస్తకముపై సుశోభితమాగాక! నువు చిత్తోడు మహారాణావైనావు ఉదయ్! [పన్నా రాజమకుటం ఉదయుని ధరింపజేస్తుంది.]

జయసింహుడు:-నీ పవిత్ర బలిదానము కారణంగా ఈ రోజు చరిత్రలో అమరమయింది అమ్మా!

పన్నా:-సర్దార్ జయసింగ్! నేను ఇన్నాళ్లనించీ గుండెల్లో పెట్టుకుని, క్షణమాత్ర వియోగానికి కూడా ఓర్వలేక, ఒడిదాటిపోకుండా, కంట వత్తిడుకుని కాపాడుకున్న సొమ్ము ఇవాళ నీచేతుల్లో వొప్పజెపుతున్నాను.

ఆశాశా:-ఈ దానము నీ బలిదానానికేమాత్రమూ తీసిపోనిదే.

పన్నా:-రావు కర్మచందు! మహారాణా! సంగ్రామసింహునికివలె, నీవుకూడా ఉదయునికి దక్షిణహస్తమై అతన్ని రక్షించుకో. మీ తండ్రిగారి ఆసనాన్ని అధిష్టించు.

[ఇద్దరు సిపాయిలు బందీఅయివున్న వనవీర్ ను తీసుకొస్తారు]

బహుదూర్:-ఎవరు? వనవీర్!

పన్నా:-వనవీర్! నీకు స్వాగతం. ఈ పట్టాభిషేక మహోత్సవ సందర్భంలో నిన్ను విడుదల చేస్తున్నాం. ప్రహరీ! వనవీరుని కట్లు విప్పు!

ఉదయ:-అమ్మా! అమ్మా! ఏమంటున్నావు?

పన్నా:-ఔను, ఉదయ్! ఏమీ పరవాలేదు.

[ప్రహరి వనవీర్ కట్లు విప్పుతాడు. వనవీర్ పన్నా పాదాలమీద పడతాడు]

వనవీర్:-క్షమించు తల్లీ! నేను నీపట్లకూడా పెద్ద అపచారం చేశాను.

బహుదూర్:-పన్నా! ఇతడు నీ యేకమాత్ర పుత్రుణ్ణి మింగేశాడు. ఇతన్ని క్షమిం...

పన్నా:-క్షమించాను మీరుకూడా క్షమించండి. అందు మూలాన ఈ పట్టాభిషేకోత్సవం మంగళమయం కాగలదు.

వనవీర్:-భయపడకు ఉదయ్! నేనీ క్షణాన్నే మేవాడే కాదు, రాజస్థానమునుకూడ విడిచి వెళ్లిపోతున్నాను. నీ సుఖ జీవితంలో నా నీడకూడా పడదు. సెలవు. [పోబోతాడు]

జయసింహుడు:-ఆగు, వనవీర్! రణజిత్తు తన అవసానకాలంలో ఇది నీ కివ్వమని యిచ్చాడు.

[శీతలసేని లిఖితపత్రం ఇస్తాడు. వనవీర్ నిష్క్రమిస్తాడు.]

బహదూర్:-ఇక మన యీ ఆనందోత్సవం నృత్యగీతములతో పరిమళించునుగాక!

[పొడుం పీలుస్తాడు]

[బాలికలు ప్రవేశించి నృత్యగీతాలు ఆరంభిస్తారు]

మాల్కోస్ - త్రితాళం

రాజా! మనుమా చిరంజీవివై

౧

రామునివలె ప్రేమపాలకుడవై,
ధర్మజాగతి న్యాయదేశికుడవై
నుతిగనుమా పాపమారకుడవై
మాజీవము బలియిత్తుము నీకై.

౨

చెలగుత నీ గుణగానమె అంతట
వ్యాపించుత నీయశ మింటింటా
దీవన లిత్తురుగావుత వేడ్కన్
దివిదేవగణము ప్రసన్నంబై.

3

దేశము సకలకళా భాసితమై
ప్రజలు సదా సంపత్ శోభితులై
మనసులు నిర్మల నిర్భయ గతిమై
యలరుగాత ఆచంద్రార్కముతై.

బాలికల స్థిరనాట్యం.

[తెర] (సమాప్తము)

# మా వాడు  

శ్రీ అల్లంరాజు
విశ్వనాథం

మావాడో చిత్రకారుడు. పేరు రామం. వాడి చిత్రాల్ని ఎందరెందరో సుప్రసిద్ధులు మెచ్చుకున్నారు. ప్రదర్శనాల్లో ప్రశంసించారు. మనదేశంలోని గొప్ప చిత్రకారుల్లో ఒకనిగా చేర్చుకున్నారు.

చిన్నప్పట్నుంచీ మా రామం తల్లితోటి, తండ్రితోటీ మారామాలు పెడుతూ బళ్లోకి వెళ్ళక ఇసుకపోగుచేసి కుక్కల్ని, నక్కల్ని చిత్రిస్తూండేవాడు. వాడి instinct ని చూసి మా వూళ్లోవాళ్ళంతా వీడు రవివర్మ అవగలడని అంటూండేవారు. పలక, పుల్ల, కాగితం, పెన్సలు కనబడితే చాలు వాటిని చేతపట్టి ఎదురుగుండా పోతూన్న జంతువునో, పక్షినో గీస్తూండేవాడు.

చిన్నవయస్సులో అంత అద్భుతంగా చిత్రాల్ని వ్రాస్తూండడం చూసి మేం అంతా ఆశ్చర్యపడే వాళ్ళం. వీడి జీవితం ఉన్నతంగానే గడపగలడనే ఆశ కలుగుతూండేది మాలో.

రామంగాడు చిలకనేసి పలకమీద మేష్టారుకి చూపించాడు. ఆయన 'ఇదేమిట్రా రెండో రెక్క పైకివేశావ్' అన్నారు. 'ఎగురుతోందండి' అని జవాబిచ్చాడు రామం. మేష్టారు నన్నుపిలచి 'ఏమోయ్ కొన్నాళ్ళలో వీడు ఆంధ్రచిత్రకారుల్ని దాటగల శక్తి సంపాదించగలడు' అని ఓ చిన్న సర్టిఫికేట్ ఇచ్చారు.

మేష్టారు మాటలకి మేం అంతా ఉబ్బిపోయాం. వాడికి ఈ లైన్‌లో ఇంటరెస్టు ఉందికదా అని గ్రహించి స్కూలుఫైనల్ అయినతర్వాత art ని improve చెయ్యడం మొదలెట్టేడు.

రామం పెద్దవాడవడం, పేరు ప్రఖ్యాతులు సంపాదించడం, పిల్లల్తో కాపురం చెయ్యడం జరుగుతూంది.

ఎటొచ్చీ, వాడు చిత్రరచనలో ఉపయోగించే తెలివితేటల్ని సామాన్య గృహజీవన సందర్భంలో వినియోగించలేడు.

పెళ్లాం విమల వాడి ideas బట్టి నడుచుకుందాం అని ప్రయత్నిస్తుంది కాని విఫలురాలవుతూంది. ప్రపంచంలో లేని వింతభావాలు రామానివి. ఓ సమయంలో రైటన్నమాట రెండోసమయంలో తప్పంటాడు. నిమిష నిమిషానికి అతని భావాలూ ఆశయాలు పరిణామం చెందుతూంటాయి. ఓపంథ త్రొక్కుదామనే దృఢసంకల్పం లేదు. వింతపోకడల్ని తెలుసుకున్న మా బంధువులంతా రామాన్ని హేళనగా చూడ్డం మొదలెట్టేరు. 'ఎంత తెలివితేట్లుంటేం? ఎంత పేరుగడిస్తే ఏం, సంసారిక జీవనంలోని ఆచారవ్యవహారాలు అర్థంచేసుకుని ఆచరణలో పెట్టలేనివానీ మొహం చూడ బుద్ధెయ్యదు—' అనే భావం మా బంధుకోటి హృదయాల్లో నాటుకుపోయింది.

ఆఖరికి అత్తగారైనా రావడం మానేశారు. 'ఇంత స్వేచ్ఛైన జీవితం లేదు' అంటాడు ఏ బంధువు రావడం విసర్జించాక. 'బంధువుల్తో నాకు పనిలేదు—వెధవ చుట్టరికం. కాస్త పర్సు బరువుగా ఉంటే కప్పల్లా చేరుతారు—తేలికయితే వాసనైనా చూడరు. ఏంతెలుసు వీళ్ళకి. ఒక్క ప్రాణమిత్రుడుంటే చాలు

చెయ్యి బంధువుల పెట్టు. సమయంవస్తే ప్రాణాలైనా త్యాగంచేయగల శక్తి స్నేహహృదయంలో ఉంది గాని వీళ్ళలో లేదు ' అంటూ అతని మనస్సు ఘోషిస్తూంటుంది.

' పోనీ, బంధువులెందుకు, ఆఖరికి నా పిల్లామైనా, నా నడవడి కని అర్థంచేసుకుందా?...లేదు... స్త్రీ హృదయాలకంత తెలివితేల్లెక్కడున్నాయి?...ఎప్పుడూ తనవారు, తను అంటే అభిమానం. వాళ్లే ప్రపంచంలోని జనాభా—మిగతావాళ్ళతో పనిలేదు. దాని తమ్ముడొస్తే స్వర్గం; లేకపోతే నరకం. వాళ్లకి నాలుగురూపాయలు మనిఆర్డరు చేస్తే సద్వినియోగం చేసినట్టు, లేకపోతే నేనేమూండలకో పోస్తున్నట్టు. ఈ స్త్రీ హృదయం తన పురుషహృదయాన్ని ఎన్నటికోగాని అర్థంచేసుకోలేదు. ఇలాంటిది ఉంటేం ఊడితేం? పేరుమాత్రం విమలం. మనస్సు ' సమలం '.

' ఈ విమలతో నాకు సంసారసుఖం లేదు. ఎన్నాళ్లీ కష్టజీవనం భరించడం? ఓనాడు కాకపోతే ఓనాడేనా హృదయానికి ఆనందాన్ని నింపుతూండాలి భార్య అన్నప్పుడు. అబ్బే! సౌఖ్యం అన్నది nil balance నా జీవితంలో పౌర్ణమిలు లేవు. ఈ విమల ముఖం అమావాశ్య నిశాధిరేఖలతో నిండిఉంటుంది. ఎంతకాలం నా కళ నా హృదయానికి ఆనందాన్ని చేకూరుస్తూంటుంది? కళ హృదయసంబంధి అయినా ఇంటి నాలుగుగోడలు మధ్యా నా మనస్సుకి పరితాపమే గాని శాంతిలేదు. ఛీ! దీని మొహం చూడకూడదు' అంటూ రామం హృదయం విలపిస్తోంది.

ఆ రాత్రే భారమైన మనస్సులతోటి సినీమాచూసి ఇంటికొచ్చి పడుక్కున్నారు రామం భార్యాను.

రామానికి నిద్రపట్టదు. గదంతా తేరిపారచూస్తున్నాడు. నరకలోకంలా కనిపించింది. విమల మొహం నరకలోకంలోని యమదూతలా కనిపించింది. విమల కదిలింది. తన్ని కొట్టడానికి యమదూత కదుల్తున్నాడేమో అనుకుని రామం జంకేడు. విమల దొర్లి దగ్గరకొచ్చింది. విమల శరీరం తాకడంతోటే ముళ్లుగుచ్చినట్టయింది. ' ఛీ! దూరంగా పో ' అంటూ రామం మంచం దిగాడు. విమల 'హా' అంటూ ఆవలించింది. ' నేను రాను ' అంటూ రామం పరుగెత్తేడు. తలుపులు తెరచే ఉన్నాయి.

మర్నాడు విమల. ఏకాంతంగా ఉండిపోయింది. ఏడీ? రామం?......భగ్నహృదయం—మరణించాడా? పారిపోయాడా?...

' నీతో సుఖించే భాగ్యం నా నుదుట వ్రాయబడిలేదు. నేను బొంబాయిలో నా స్నేహితుడింట జీవిస్తాను. నీకూ నాకూ...ఇంతే...'

అభాగిని. విమల సంసారనౌక సాగడం ఎలాగ? పతి ప్రేమామృతపాత్రని చేతులారా బోర్లపడ త్రోసుకుంది...

# ఆదర్శ నారీమణి

శ్రీమతి పులిపాక బాలాత్రిపురసుందరమ్మ

'ఇందిరా! ఏంచేస్తున్నావు? జ్ఞాపకమున్నామా?'

'ఓహో మాలతీ! ఎప్పుడొచ్చావు? బస్తీకి వెళ్లినదానివి నీవు మరవాలి గాని మాకేంమరుపు? అంతా క్షేమమా? మీ అమ్మకు జ్వరమట నిమ్మళంగా ఉన్నదా?'

'చూచి వెళ్లుదామనే వచ్చాను. కొంచం తగ్గింది గాని ఇక్కడ నాకేమీ తోచటంలేదే ఇందిరా!'

'అక్కడేంచేస్తూ ఉంటావు తోచేపనులు మాలతీ?'

'ఏదో చేస్తూనే ఉంటాను. యెంబ్రాయడరీ వర్కు, రిబ్బన్ వర్కు, కుషన్ వర్కు, నెంబరు దారంతో కర్టన్సు, టేబులు క్లాత్సు యేవో ఇల్లాగంటివే చేస్తూఉంటాను.'

'ఇక్కడికి తెచ్చుకోలేకపోయావు?'

'రెండురోజుల కెందుకని తెచ్చుకోలేదు. తెచ్చుగున్నా లాభంలేదు. ఏదో ఒకదారం లేకపోతే ఈ ఊళ్లో దొరకదు. అది మూలపడి ఉండవలసిందే మళ్లీ వెళ్లిందాక. మునుపొచ్చినప్పుడు ఇల్లాగే యిబ్బందైంది. మా నాన్నగార్ని తెనాలినుంచి తెచ్చిపెట్టమంటే ఒకటి చెబితే ఇంకొకటి తెచ్చారు. అందుకని ఈ మాటు తెచ్చుగోలేదు. నీకెల్లా ప్రొద్దుపోతుంది? ఇందిరా. నువ్వేమన్నా చేతిపనులు చేస్తూ ఉంటావా?'

'చేతిపనులంటే యేమిటి? మాలతి!'

'యేమున్నాయి ఇవ్వే—కుట్లూ, అల్లికలు, పూసలతో బుట్టలు, పళ్లాలు ఇల్లాంటిపనులే చేస్తూ ఉంటాను.'

'ఏం పనులో నువ్వు చెప్పినవి నాకు వక్కటన్నా అర్థంకాలేదు. తెలుగుతో చెప్పు.'

'తెలుగులోనే చెప్పాను. రిబ్బన్ వర్కు అంటే పటములు, యంబ్రాయడరీ వర్కు అంటే గుడ్డల మీద రంగుదారములతో కుట్టటం, పూసలతో లేసులల్లి రవికలకు గౌనులకు వేసుగోడం, పూసలతో బుట్టలు, పళ్లాలు బొమ్మలడగ్గిరికి పనికివచ్చేవి అల్లుకోవడం, ఇవ్వే చేతిపనులు. ఇంకేమున్నాయి.'

'ఇవ్వన్నీ యెట్లా వస్తాయి మాలతి!'

'డబ్బుపెట్టి కొనుక్కుంటే వస్తాయి.'

'అవి నావల్ల కాదు. నీ భర్తకు నూరు రూపాయలు జీతం గనక, నీ ఇష్టంవచ్చినట్లు ఖర్చు పెడతావు. మాకన్నీ పండిన గింజల్లోనే జరగాలి. ఇట్లాటి ఖర్చులు పెడతానంటే మా పంతులుగారు ఊరుకోరు. నాకూ ఇష్టంలేదు.'

'నీకు ఇష్టంలేదనుగాని, మీ పంతులుగారిమీద వెయ్యడం, ఎల్లా వొస్తాయని పేదపలుకులు ఎందుకూ? నీకే ఇష్టంలేదు గనుక ఊరుకున్నావు. మీవాళ్లిచ్చిన పొలంమీద డబ్బేంచేస్తున్నావు?'

'ఉన్నది, దానధర్మం చేస్తూఉంటాను.'

'అయితే? ఇందిరా! నీకు ప్రొద్దెల్లా గడుస్తుంది?'

'నాకు ప్రొద్దే చాలదు.'

'ఏం చేస్తావు?'

'నేనూ కొన్ని చేతిపనులు గృహపరిశ్రమలు చేస్తాను.'

'ఏం పనులు చేస్తావు? నాకు చూపించవు?'

'నా పనులు నీవుచూచి ఆక్షేపిస్తావు.'

'ఆక్షేపించనులే చూపించు.'

'విస్తళ్లు కుడుతాను, మజ్జిగచేసి వెన్నకాచి నెయ్యిచేస్తాను. వాడుకోంగా మిగిలినది అమ్మిస్తాను.'

'ప్రేవేటుగానా? పబ్లికుగానా? అమ్మించడం?'

'పబ్లికుగానే. తప్పేమున్నది. మిగిలితే యేంచేస్తారు?'

'ఇంకా యేంచేస్తావు?'

'రాట్నం వడుకుతాను. వడికినదారం కొంత మూడుపేటలుగా వేసి మళ్లీ వడికి ఆ దారంతో ఇల్లమీదికి వాకిళ్లకు గుడ్డలల్లుతాను. పేడమురుగుడువేయించి పిడకలుచేయించి మేము వాడుకోంగా మిగిలినవి అమ్మిస్తాను. ఇంటికి సరిపడు కుంకుమ నేనే తయారుచేస్తాను. మల్లెపువ్వులు, గులాబిపువ్వులు మా పెరట్లో పూస్తాయి. ఆ పువ్వులు, కచూరములు ఇంకా కొన్నిదినుసులువేసి తలనూనె కాచుతాను. ఆముదములు వండి చమురు తీస్తాను. పెరటిలో పొట్లా, కాకర, చిక్కుడు మొదలైన కాయకూరలు, దబ్బనారింజ సపోటా మొదలైన ఫలములు, నూపర మొదలైన ఇతర యెరువులులేకుండా, మా పశువుల యెరువుతోనే పండించుగుంటాము. ఈ పనులు చూచుగుంటూ తీరికవేళలప్పుడు పురాణగ్రంధములు చదువుకుంటాను.'

'అబ్బా ఇందిరా! ఇంత కష్టపుపనులు నేను చెయ్యలేనే. అందుకనే నీవు చూడు నాకంటే చిన్న దానవుకదా? యెల్లా మోటుతేలావో చూడు. అంత గొప్పకుటుంబంలో పుట్టి ఇంత గొప్పకుటుంబంలోకి వచ్చి నీకెందుకు ఈ కష్టం?'

'నేను ఈ కష్టం చెయ్యకపోతే జరగదని కాదు. మాలతి! గొప్ప కుటుంబీకులు గనుక వళ్లువంచి సోమరితనం మాని పనులుచేస్తూంటే కొద్ది కుటుంబాలవాళ్లుకూడా మనలనుచూచి నేర్చుకుంటారు. మనము సోమరితనంగా ఉంటే మనము ఆక్షేపిస్తామని జంకేవారు కొందరు. గొప్పవాళ్లు అంత సుఖపడుతున్నారే మనము కొంచమన్నా సుఖపడ్డవద్దా అనుకునేవారు కొందరు. మొత్తముమీద అందరూకూడా ఎవరికితగిన సోమరితనం వారు నేర్చుకుని, సొంతకాని అనేది ఎఱుగక, భర్త కాని యిస్తే పువ్వులు కొనాలి, లేదంటే ఆయనను సాధించాలి అనే ఉద్దేశ్యమే తప్ప, వారిదగ్గర ఉన్నదో లేదో, మన సొంత కృషివల్ల కాని సంపాదించుదాము అనుకునేవారు బొత్తుగా తగ్గిపోతున్నారు, అంతా నాగరికులే అవుతున్నారు. గనుక లోకానికి సంఘానికి ఆదర్శం చూపించుదామని చేస్తున్నాను గాని, ఈ డబ్బు లేకపోతే నాకు జరక్క కాదు. మాలతీ నిన్ను ఆక్షేపించాననుకోకు సుమా. మాటవరుసకు చెప్పాను. లోకపరిస్థితి ఇట్లా ఉన్నది.'

'ఇందిరా! నీవు ఆక్షేపించినాసరే గాని, దుర్బలమో, సోమరితనమో గాని ఈ పల్లెటూరి పనులు మట్టుకు నేను చెయ్యలేనే.'

‘పల్లెటూరి పనులు కష్టమంటావుగదా? నీవు పుట్టిన దే ఊరు? నిన్ను ఇచ్చిన దే ఊరు?’

‘రెండూ పల్లెటూళ్లైనా, బస్తీలో ఉండటం అలవాటైన తరువాత పల్లెటూళ్లో ఉండటం కష్టం. ఈ ఊళ్లో పిల్లలకు బిస్కత్తులన్నా దొరకవు. బజారుకు వెళ్లుతామని, షికారుకు వెళ్లుతామని పిల్లలు ఒక్కటే గోల. నాకూ ఏమీ తోచటంలేదు. పగలంతా కుట్టుగోవడం, అల్లుకోవడం, నాలుగు గంటలకు క్లబ్బుకు వెళ్లడం, ఏడుగంటలకు సినీమాకు వెళ్లడం-ఇలాసాగా కాలం గడుస్తూఉంటుంది మావూళ్లో. ఎల్లాగైనా బస్తీలో సుఖంగా ఉంటుంది గాని, పల్లెటూళ్లో ఏంసుఖం?’

‘కష్టపడి కాయకష్టంచేసి పూయించి, కాయించి, పండించి తెచ్చి మీ బస్తీలో కుమ్మరిస్తూంటే మీబోటివాళ్లు సుఖపడటానికి అలవాటుపడ్డారు. అంతా సుఖపడటానికే కూర్చుంటే కష్టపడి ముద్దినుసులూ పండించేవారెవరు? కష్టపడి పండించేవారు లేకపోతే మీబోటివారు సుఖపడడానికి అవకాశం యెట్లా కలుగుతుంది?’

‘కష్టపడి పండించేవారు యెప్పుడూ ఉంటారు. వాళ్లు కష్టపడి పండించక, బస్తీకితేక అమ్ముకోక పోతే వాళ్లకు జీవనాలెల్లా గడుస్తాయి? డబ్బున్నవాళ్లు యెక్కడైనా కొనితెచ్చుగుంటారు.’

‘మాలతీ! నీవు గర్వపడబోకు. డబ్బున్నవాళ్లు యెక్కడతెచ్చుగున్నా, కష్టపడి పండించినవాళ్ళ దగ్గిరేకదా? పల్లెటూరివాళ్లకు బస్తీ అవుసరములేదు గాని బస్తీవాళ్లకు పల్లెటూరే అవుసరము. బస్తీవారు వాడే తినుబండములన్నీ పల్లెటూళ్లవే గాని, బస్తీవి పల్లెలకు అవుసరములేదు. పల్లెటూళ్లమీద బస్తీలు ఆధారపడిఉన్నాయి గాని బస్తీలమీద ఆధారపడి పల్లెలు ఉండలేదు. పల్లెటూళ్లలో లేని వస్తువు లేదు. రాజోపభోగములకు అలవాటుపడకపోతే బస్తీతో అవుసరములేకుండా జీవిస్తవి పల్లెటూళ్లు.’

‘ఇందిరా నీవు పల్లెటూళ్లను మహా పొగుడుకుంటున్నావు గాని బస్తీకొచ్చి ఏదీ కొనకుండా యెల్లా జీవిస్తారు?’

‘సుఖంగా జీవిస్తాము. ఆముదములు, నువ్వులు, కొబ్బరి పండుతవికదా? తాలింపుకు, తలనూనెకు, దీపపు చమురునకు బస్తీ అవుసరములేదు. తరువాత చింతపండు, ఉప్పూ, మిరపకాయలు మా పంటలేకదా? వరి, జొన్న, సజ్జ మొదలైన పంటలు చెప్పనవసరమే లేదు. బెల్లము, మినుము, శనగ, పెసర మొదలైన కాయ ధాన్యములు పల్లె పంటలే. కంద, చామ, పెండలము, ఉల్లి, చిలగడము, పసుపు మొదలైన గడ్డ పంటలు పల్లెటూళ్లవే కదా? గోగునారకూడా ఇక్కడే పండుతుంది. గొడ్లపలుపులు, చాద్రతాళ్లు, వ్యవసాయపు మోకులు తయారుచేసుగోడానికి నార సమృద్ధి. రాజభోగములు అవుసరములేకపోతే, ఇంతవరకు నేను చెప్పిన వస్తువులతో బస్తీ అవుసరములేకుండా భుజించి నిద్రించవచ్చు. ఇక వస్త్రములకు తప్పదంటావా? అదీ అవుసరములేదు. రాట్నములున్నవి. చేలలో ప్రత్తి పండుతుంది. ప్రత్తి దేనికదితీసి ఇచ్చేవారుకూడా ఇక్కడనే ఉన్నారు. ఏకులు వడుకుట అందరికి చేతనైన పనేకదా? దారంతీస్తే నేసేవారు సాలీలున్నారు, మాలదాసరులున్నారు. చక్కగా నేసి ఇస్తారు. రంగులు కావలెనన్నచో, నీలిఆకు ఇక్కడనే పండుతుంది. అది మందు తయారుచేసి నీలిరంగు, జాబరా విత్తనములు పండుతవి వాటితో జాబరారంగును వేసిఇస్తారు. ఇక బస్తీతో అవుసరమేమున్నది? గుడ్డలు కుట్టటానికి జంగాలున్నారు, చెప్పు మాలతీ, మాట్లాడవేం? బస్తీతో అవుసరములేకుండా మేము హాయిగా జీవిస్తాము. పల్లెటూరితో అవుసరములేకుండా మీరు ఉంటారా? చెప్పు.’

‘ఏం మాట్లాడను ఇందిరా! నీవలా ఉపన్యాసం ఇస్తూఉంటేను. పోనీ, పాత్ర సామానుకన్నా రానక్కర్లేదా?’

‘అదీ అవుసరములేదు మాలతీ! మనపెద్దలు మట్టిపాత్రలు వాడేవారు. మనమవ్వి వాడకపోయినా ఇత్తడివి చేసేవారుకూడా ఇక్కడనే ఉన్నారు. రాచ్చిప్పలుకూడా యిక్కడికే వస్తూఉంటాయి. రాక పోయినా యిబ్బందిలేదు. మట్టిపాత్రలు వాడుకుంటాము గాని ప్రత్యేకము వాటికొరకు ఇంకొకచోటికి వెళ్లవలసిన అవుసరములేదు.’

‘ఎచ్చే కుండలెల్లా వాడుతావే? యిందిరా?’

‘బాగానేవాడుతాను, కుండలో అన్నంవండితే చలువ. ఆరోగ్యముగా ఉంటుంది. జబ్బులుండవు. అల్యూమినీయం పాత్రలు వాడితే జబ్బులు వస్తాయి. ఒకప్పుడు ప్రమాదంకూడా కలుగుతుంది.’

‘ఇందిరా! ఇక్కడివాళ్లకు మట్టుకు జబ్బులు రావడంలేదూ?’

‘జబ్బులువచ్చినా మీమాదిరిగా ఎక్కువరోజులు బాధించవు. డాక్టర్లకు యెక్కువడబ్బివ్వక్కర్లేదు.’

‘నీవు యెన్నన్నా చెప్పు. ఇందిరా నా మనస్సుకుమాత్రం బస్తీ సౌకర్యాలే సుఖంగాని పల్లెటూళ్లు సుఖంలేదనిపిస్తాయి. ఇక వెళ్లివస్తా యిందిరా. పసిపిల్ల పాలకేడుస్తుంది.’

‘అప్పుడే వెళ్లుతావా? మాలతి! నీతో మాట్లాడి చాలారోజులైంది. పిల్ల ఏడిస్తే మీ చెల్లెలు తీసుకొస్తుందిలే. కొంచముసేపు కూర్చుందూ. క్రొత్తగా వస్తువులేవన్నా చేయించుకున్నావా?’

‘ఇంకా సొమ్ములకుకూడా డబ్బు మిగులుతుందా? యేనెల కానెల హోనీహోనిగా సరిపోతుంది.’

‘నూరు రూపాయలు జీతం అంటివికదా? ఏంచేస్తారు డబ్బంతా? మీవారు నీచేతికివ్వరూ?

‘అదేమీలేదు. అంతా వాడుతాము. ఆదాయముకంటే ఖర్చే యెక్కువకనిపిస్తుంది. పదిరూపాయలు కాఫీఖర్చులకే కావాలి. అదిగాక ఇంటిఖర్చుకావాలి. ఇవిగాక నాకు నా క్లబ్బుచందా, వారికి వారిక్లౌన్ హాలు చందా, సబ్బులని, హెయిర్‌పిన్నులని, పౌడర్లని, రిబ్బన్‌లని వాటికి కొంత. పిల్లలకు గ్లాక్సో బిస్కత్తులని, వేరే వాళ్లకు త్రాగటానికి పాలు, పండ్లు, టానిక్కులనీ, పిల్లల ఆట వస్తువులనీ—ఇల్లాంటివి యెన్నో ఖర్చులు; ప్రతినెల డాక్టరుబిల్లు తప్పదు. పనిచేసేమనిషి, ప్రొద్దుగూకులు ఇంట్లోఉండి పిల్లలను ఆడించే నౌకరు, ప్రేవేట్లు, స్కూలుజీతాలు తప్పనిసరి. పూసలని, దారాలని ఇల్లా కొంతఖర్చు. నెలవచ్చేటప్పటికి జీతంగాక ఇంటినుంచికూడా తెప్పిస్తూంటారు డబ్బు. గుఱ్ఱపుబండీవాడికే నెలకు పదిరూపాయలియ్యాలి. తగ్గించేఖర్చు వక్కటన్న కనపడదు ఇందిరా!’

‘మాలతీ! మీకేం మహారాజులు. యెంతైనా ఖర్చుపెడతారు. యింటిదగ్గిర యెవరున్నారు?’

‘మా మామగారు ఉండి పొలంపనులు చేయిస్తూఉంటారు. అన్నట్లు మరిచిపోయాను. ‘ మునుపు వొచ్చినప్పుడు నీవుకూడా యేవో దారాలు అవ్వి కావాలంటివే ఇందిరా?

‘నీవుచెప్పిన పనులన్నీ డబ్బుఖర్చుఅయేవి. ఆ డబ్బు విదేశానికి పోయేదితప్ప మనదేశంలో ఉండేది ఒక్కకానికూడాలేదు. అందుకని అవి కొనడం నాకిష్టంలేదు, మాలతి! అవి కొనడానికి డబ్బుకావాలి. అదీ కాక ఇంట్లోపనులన్నీ చాలించుగుని అవి కుట్టటమో, అల్లటమో చెయ్యాలి. కొట్నంవడికితే ఇంటికి, దేశానికి క్షేమం. ఆ మిగిలినకాని ధర్మంచేస్తే కుంటి, గుడ్డి బ్రతుకుతారు. ‘కదురుతిరిగినా, కవ్వంతిరిగినా, కాటకముండ’దన్నారు పెద్దలు.

'యిందిరా! నీకు కాంగ్రెసన్నా, ఖద్దరన్నా చాలా అభిమానం ఉన్నట్లున్నది. నాకూ ఉన్నది గాని ఆ మొద్దుచీరలు నేకట్టలేనే ఇందిరా! నీవు విదేశం అసలే కట్టవా?'

'కట్టడం మొదలుపెట్టినతరువాత కొంతఅది కొంతఇది యెందుకు? ప్రక్కనకూడా విదేశీగుడ్డ వేసుకోను.'

'పిల్లలకేం కడతావు?'

'మేం కట్టిస్తే ఖద్దరేగాని, చుట్టపక్కాలు కుట్టిస్తే కట్టుకుంటారు పిల్లలు. నాకుమాత్రం విదేశిది పెట్టరు. పెట్టినా నేను కట్టుకోను'

'ఇందిరా వెళ్లివస్తా నీకూ వంటవేళైంది.'

'మాలతీ నీవు వెళ్లేలోపల ఒక్కమాటు వచ్చి వెళ్లు. వీలుగాఉంటే నేనే వస్తాలే'

'ఇంకా వెళ్లేలోపలెప్పుడు? రేపు మధ్యాహ్నంనుంచీ వెళ్లుతాను'

'అప్పుడే యేం తొందరే? వారంరోజులన్న ఉండవూ?

'నిన్నటినుంచీ రెండోవాడికి జ్వరం. పిల్లలుముగ్గురు నాతోనే వచ్చారు, తీసుకుపోకపోతే మా అమ్మ కోప్పడుతుంది. ఈ జ్వరాలు అంటుజ్వరాలో యేమోగాని మా అమ్మకు తగ్గింది, పిల్లవాడికి వచ్చింది. ఈ జ్వరం యెక్కువైతే వాళ్ల నాన్నగారు కోప్పడతారు. డాక్టరుగారు చెప్పారు నీళ్లుమారిస్తే పిల్లలకు జబ్బు చేస్తుందని. అల్లాగే వచ్చిందికూడాను. నాకు భయంగాఉన్నది. తప్పక రేపువెళ్లుతానే. వాళ్లకు తెలుగు మందులు సరిపడవు.'

'ఇక్కడ మట్టుకు పరాయివాళ్లా? మాలతి! అట్లా భయపడతావు?'

'అల్లాకాదు ఇందిరా. పిల్లలకు ఏదన్నా వక్కరవ్వవస్తె మామూలు డాక్టరు మందివ్వాలి, వారు దగ్గిరుండాలి గాని, యింకొకచోట ఉంటే ఒప్పుకోరు. వెళ్లివస్తా ఇందిరా. జ్ఞాపకముంచుకో' అని వెళ్లిపోయింది మాలతి.

ఇందిర పుట్టినిల్లు వడ్లమూడి. అత్తవారిల్లు అనంతవరం. గొప్పయింట పుట్టినది. గొప్పఇంటికొచ్చినది. అయినప్పటికి గొప్పదానిననే స్వాతిశయం లేకుండా ఇంటిపనులన్నీ తాను స్వంతముగా చేసిచూపించి నౌకర్లచేత చేయిస్తుంది. అవుసరమైతే తానుకూడా చేసి లోకానికి ఆదర్శం చూపవలెనని ఆమె ఉద్దేశ్యం.

ఇందిర చదువుకున్నది. తెలివికలది. బుధ్ధిమంతురాలు. డబ్బుకూర్చే మార్గములు అవలంబించి నా లోభత్వము లేకుండా బీదసాదలకు అంతో ఇంతో బెడుతుంది. పతిభక్తి, దైవభక్తి ఆమె ముఖ్య వ్రతాలు. ఇందిర చామనచాయలో చక్కనిదని చెప్పక తప్పదు. చెంపకు చారెడుకండ్లు, వీపున బారెడు జడ, కురుచగా అందమైన మనిషి. ఇందిర భర్త సుందర్రావుకూడా ఆమెకుతగిన పురుషుడు, అన్నివిషయములలోనూ ఆమెకు అనుకూలముగా ఉంటాడు. అతనుకూడా సోమరికాడు. పొలముపనులన్నీ తాను సొంతముగా చూచి చేయించుగుంటాడు గాని పనివాళ్లమీద వదిలిపెట్టడు. బాగా చదువుకున్నవాడు కావడంచేత ఊళ్లో యెవరికన్నా వ్యవహారములు దీబ్బాపేక్షలేకుండా సత్యముగా చేసిపెడుతూ ఉంటాడు. భార్య చెప్పినట్లు భర్త, భర్త చెప్పినట్లు భార్య తూచా తప్పకుండా సంసారయాత్ర సుఖంగా గడుపుతున్నారు ఇందిరా సుందర్రావులు.

---

# సంస్కరణ

శ్రీ వల్లభనేని రంగాదేవి

జ్ఞానపూర్ణులమంటు
గర్వించుచుండియూ
అడ్డుపలికినదంటు
ఆలినే గొట్టేటి
శుద్ధచవటలనెల్ల సంస్కరించకపోతె
సాగునా సంసార సారధ్యమిలలోన ?

కట్నమొద్దని నాడు
కనుసైగతో గలసి
కట్నానికై భార్య
కష్టాల ముంచేటి
శుద్ధచవటలనెల్ల సంస్కరించకపోతె
సాగునా సంసార సారధ్యమిలలోన ?

పచ్చగా గాన్పించు
పరనారి గూడియూ
పగలు బయటికిరాకు
పత్నిరో సీవనెడి
శుద్ధచవటలనెల్ల సంస్కరించకపోతె
సాగునా సంసార సారధ్యమిలలోన ?

అన్నియుడిగీకూడ
ఆలిగావలెనంటు
బాలవిధవకు పెండ్లి
బాగులేదని యరచు
శుద్ధచవటలనెల్ల సంస్కరించకపోతె
సాగునా సంసార సారధ్యమిలలోన ?

అల్లారుముద్దుగా
యాడించు బిడ్డలనె
ఆలిపోయినతోడ
నావలకు గొట్టేటి
శుద్ధచవటలనెల్ల సంస్కరించకపోతె
సాగునా సంసార సారధ్యమిలలోన ?

భార్య బిడ్డలతోడ
భోగాల నందుచూ
బాలవిధవల నట్టె
బంధించియుంచెడీ
శుద్ధచవటలనెల్ల సంస్కరించకపోతె
సాగునా సంసార సారధ్యమిలలోన ?

తల్లి పోయినతోడ
పిల్ల నావలతరిమి
కొత్త పెళ్లముతోడ
కులుకుచూ కూర్చుండు
శుద్ధచవటలనెల్ల సంస్కరించకపోతె
సాగునా సంసార సారధ్యమిలలోన ?

(కాశీ విశ్వనాథంగారి "సంస్కారం" అను యముద్రిత గ్రంథమునుండి)

# ★ అశోకుడు

● శ్రీ భాగవతుల ఉమామహేశ్వరశర్మ

[స్థలము ఉద్యానవనము. ఏకాంతముగా ఖిన్నవదనుడై ఏదో దీర్ఘాలోచనలో అశోకుడు ప్రవేశించును. వికలముగా నటునిటు తిరుగుచు చివరకు నొక చలువరాతి దిమ్మెపై నుస్సురుల విడచుచూ కూలబడును.]

అశోకుడు :—ఊః! ఎన్ని విధముల యత్నించినను ఆ మాళవరాజపుత్రిక ప్రేమకు పాత్రుడ కాజాలకుంటినే! అది నా లోపమా? లేక...ఆహా! ఏమి! ఆ రాజపుత్రికయొక్క దివ్యమోహన విగ్రహము! రత్నాభరణాలంకృతయై ఆ ముద్దులగుమ్మ వచ్చినదే తడవుగ నా కోటకదేదో యొక క్రొత్త శోభ వచ్చినదే! ఆ బాల షోడశవర్షప్రాయ. ఆఘ్రాతముగాని పుష్పము. ముజ్జగంబులవారల కనుసన్నల గీలుబొమ్మల చేజాలు ఆ రాణుల ఠీవి, దిగంతంబులకు వ్యాపించెడి కీర్తి బడయజాలు జగజ్జేతల గనదగు వీరమాతలకుండు ఆ గాంభీర్యము ఎక్కడిదో! ఆ ముగ్ధ మోహనబాల నా పట్టమహిషియై నా యఖండ రాజ్యలక్ష్మియై నా దుర్గలక్ష్మియై కన్నులపండువగా యెదుట నుండ చాలదా? కాని, ఆ రాజపుత్రిక సౌందర్యమం దేమాత్రము విషయ వాసనయూ లేదే! పూచిన సంపెంగయొక్క నివృత్తి శోభయే దక్క వలపుల వెదజల్లు లేగులాబికుండు ప్రవృత్తి శోభ లేనేలేదే! ఇక మరల్చుటెట్లు? ఆ విశ్వమోహన సౌందర్యము నన్ను రాజ్యాంగ విషయ విముఖునిగా చేసినది. రాజ్యతంత్రమును మంత్రుల కప్పించినది. ఆమె సౌందర్యోపాసనయందే మగ్నుడనై తుదకు దాసునివలె భోజన సామాగ్రిని నేనే స్వయముగా గొనితెచ్చి, చెంతగూర్చుండి, సరససంభాషణలలో ముంచి భోజనమును తినిపించుచుంటినే! ఇంతకును కరుణ రాకపోయెనే! అదియునుగాక రాజపుత్రి కొన్నిదినముల నుండి క్రమక్రమముగా నొక్కొక్క నగను విసర్జించుచున్నదే! చివరకు పరిచారికవోలె సామాన్య వస్త్రయైనదే! తండ్రి తోబుట్టువుల వియోగదుఃఖముచేత నేమోనని ఎన్నో విధముల బుజ్జగించితిని! ఎన్నో యాకర్షణముల జేసితిని! చెలికత్తెల నిరంతర కళావిషయగోష్ఠికై నియమించితిని! కాని యేమి ఫలము! ఎంతకును యోగినీ ప్రవర్తనయే! (ఇంతలో ఘల్లు ఘల్లున గాజులధ్వని వినబడును. అశోకుడిటు తిరిగిచూచి) రాజపుత్రికయేనా ఆ వచ్చుచున్నది! యేనాడు మందిరమును వదలిరాని ఆ బాల నేడు వాహ్యాళికై అలంకృతయై ఉద్యానవనమునకు వచ్చెనే! ఏమీ! నా వంకకే వచ్చుచున్నదే! అబ్బ! ఏమి నా పుణ్యము! పూర్వపు యోగినీవేష మేమాయెను? నా మగధ సామ్రాజ్యలక్ష్మికన్న విశాలమై రమణీయమైన ఆ ఫాలభాగము, ఆ నును చెక్కుల మిసమిసల పసందులు, ఆ వాల్గన్నుల పుల్కుపుల్కులు...(ఇంతలో నా సుందరి సమీపించును) సుందరీ! సుందరీ!! నిన్నే స్మరించుచున్నాను. వచ్చితివా! ధన్యోస్మి! బాలా! నీవే నా పట్టమహిషివి, నీవే నా సామ్రాజ్యలక్ష్మివి, నీవే నా పరమావధివి. రా! యిదే అర్ధాసనమిచ్చెద చాలదా? పూర్ణసింహాసన మిచ్చెద నిదిగో! (అని లేచి యా రాజపుత్రికయొక్క కిసలయ కోమల కరముల నందుకోబోవును.)

రాజపుత్రిక :—ఆగు! రాజా! ఆగు! (అని నిట్టూర్పుతో) రాజా! నన్ను పరిణయమాడుటా! అశోకా! నా తండ్రిని నా అన్నను చంపి, మాళవరాజ్యమును మగధసామ్రాజ్యములో కల్పుకొంటివి! నన్ను దిక్కులేనిదానిగా జేసివైచితివి. నాకు 'నా' అన్న వారలెవ్వరు లేరుగదా! రాజా! 'శరణాగతనైన నాకు ఆ అశోకమహారాజు తన విశాల సామ్రాజ్యమున నొకింత నిలువ నీడజూపడా?' యని వెట్టినై నిన్నే నమ్మ

కొని నీ యందజేరితిని. నా తండ్రితర్వాత తండ్రియంతటివాడివి, నా అన్న తర్వాత అన్నయంతటివాడివి, రాజా! అశోకా! నీవా! నిన్ను నమ్ముకొన్న నన్ను ఇట్లు గ్రుడ్డిమోహమునకు లోనై పరిణయమాడనెంచుట! రాజా! కళ్లువిప్పుకో! పాఱజూచుకో! నీ పుత్రికనా నీవు వివాహమాడుట? నీ సోదరినా నీవు కూడుట? నీకు గుండెయన్నది యున్నదా? రాజా! నీ మనుష్యజన్మగతి ఏమౌతుందో ఆలోచించుకొన్నావా రాజా! నీ యంతలేసి వారలే యిట్లుచేసిన నీ రాజ్యమందు ధర్మప్రగతి యేమికావలె రాజా! చెప్పు. (అశోకుడు వెఱ్ఱి చూపులతో, బిక్కమొగముతో, కన్నీటితో నిలబడియుంటాడు. రాజపుత్రి నిట్టూర్పువిడుస్తూ) రాజా! నీ రాజ్యకాంక్ష పాడుకానూ! రాజ్యకాంక్షయేగా నిన్నిట్లు యుద్ధములకు ప్రేరేపించినది? రాజా! నీవు గూఢవేషధారివై ప్రజాభిప్రాయము తెఱుంగుటకు రాత్రుల పట్టణవీధుల బోవునపుడు ఎంతమంది తలిదండ్రులు, మూడుకాళ్ల ముదుసళ్లు, తమ బిడ్డలను నీ పొట్టనబెట్టి తమ యింటిదీపముల నార్పుకొని చేతులు కడుగుకొని 'దేవుడా' యని నీవు కారణముగ, నీ రాజ్యకాంక్ష కారణముగ, నీ యుద్ధము కారణముగ పిక్కటిల్లుచున్నారు? చూచినావా? రాజా! వారినిజూడ నీకడుపు తరుగుకపోలేదా? నీగుండె వెన్నవలె కరిగిపోలేదా! వారి కుమారుల తిరిగి బ్రతికించి వారికిచ్చేది యెవరు? చెప్పు? రాజా! యుద్ధము, సైన్యమూ ఆత్మరక్షణకని తెలియదా? రాజ్యతృష్ణను దీర్చుకొనుటకనిమాత్ర మెఱుగుదువా? నిష్కళంకులే! స్వతంత్రులే! వీరులే! నీ సైనికులు, నీ దేశభక్తులు. వారిని పిశాచాల పాలుచేసి నీ ప్రజలభీభత్సం చేసుకొని పెరవారి ప్రజల భీభత్సంచేసి పెరరాజును చంపి వంశమును నాశనంచేసి బీడుపడ్డ రాజ్యంలో పిశాచాలపాలైన స్వతంత్రవీరుల పుఱ్ఱెలమీదనా నీ విజయ స్తంభము నెత్తుట? ఛీ! ఒకవేళ పెరరాజు బంధితుడైతే బంధితుడైన శత్రురాజు మిత్రుడౌతాడా? స్వాతంత్ర్య సైనికులు, ప్రజలు నీ నెత్తుటికూటికి నీ మోచేతినీటికి ఆసపడి నీకు జోహారులియ్యనొప్పుతారా? రాజా! ఎంత వెఱ్ఱివోయీ! ఇట్టి భీభత్సమై ఫలితమైన శాంతిరహితమైన నెత్తురుకూడైన హింసామయమైన హింసచే నెలకొల్పబడిన నీ సామ్రాజ్య సింహాసనముపై కూర్చుండ ఏ అంతరాత్మ ఒప్పుతుంది? రాజా! రక్తసిక్తమైన నీ పాణిని గ్రహించుటకు ఏ శీలవతి ఒప్పుతుంది? అర్ధసింహాసనమైననేమి! పూరసింహాసనమైన నేమి! హింసామయము. నిన్నిట్లు గ్రుడ్డివానినిగ జేసివైచినది ఈ నా సౌందర్యమేగా! ఏదీ! రాజా! ఇటు చూడు (అని తనపైని ముసుగును తీసివైచును.)

అశోకుడు:—ఆ! ఆ! ఆ నగలేవి? ఆ కుసుమములేవి? ఆ దుకూలములేవి? కాషాయాంబర ధారిణివైయి, ఏమి! ఆ వర్చస్సు! తప్తకాంచనమువలె మెరయుచున్నదే! జడల దాల్చినదే! ఏమి! ఆ కరుణా రసము వెల్లివిరియుచున్నదే, కన్నుదోయినుండి (అర్ధోక్తులు)

రాజపుత్రి:—రాజా! మానవుడు నీవలెనే స్వతంత్రుడుకాడూ! అది ప్రకృతిధర్మముకాదూ! ప్రకృతిధర్మము నెదుర్కొన నీవశమా! ప్రయత్నించిన మహాపరాధము కాదా! రాజా! నీ ఘోరసామ్రాజ్య తృష్ణను నాశనంచేసుకోవాలి. లేకపోతే సర్వమతసారమైన విశ్వమానవ సౌభ్రాతృత్వమునకు నీ గుండెలో తావుండదు. ఇకముందు నీ రాజ్యములోకూడ తావుండదు. తావుండజేసికోవలెనన్న మూలసాధనము 'ప్రేమ' దాన్ని ఆశ్రయించి, రాజా! ప్రేమ అంటే నీవనుకొన్న గ్రుడ్డిమోహము, భీభత్స రాజ్యకాంక్ష కాదుసుమా! ఆ ప్రేమచేతనే నీకు నీ రాజ్యానికి ఈ ప్రపంచమునకు శాంతి కలుగుతుంది. నీవు బుద్ధభగవానుని భూమియందు జన్మించియున్నావు. కాని నీలో సహజమైన ప్రేమ నశించిపోయింది. నీ మనుష్యజన్మ మైలపడిపోయింది. నీ అంతరాత్మను ఆ ప్రేమరసముచే శుద్ధిచేసుకో. రాజా! భగవంతుడు ప్రేమమయుడు, ప్రేమ బద్ధుడు. నీవు ప్రేమమయుడవు కమ్ము. అప్పుడు 'ధన్యోస్మి' అని చిందులద్రొక్కు. రాజా! ఇకనైనా నీ రాజ్యములో హింసను మాన్పి మాబోటివారికి ఆత్మశాంతినొసగు. సెలవా? రాజా!'





యాత్ర

చిత్రకారుడు: పి. వి. నరసింహారావు, మద్రాసు.



కుమారి ఇందూరాజూర్కర్ గారు

ఈమె ఈ సంవత్సరం హైదరాబాదు H. S. L. C. పరీక్షలో ప్రథమస్థానము (Dominion First) వహించి గోఖలే సహకారవేతనము పొందిరి. ఈ వేతనము నాలుగేండ్లవరకు ఈమెకే దొరకును.







శ్రీమతి రంగమ్మ ఓబలరెడ్డిగారు

ఈమె నిజాం రాష్ట్రీ అష్టమాంధ్ర మహిళా మహాసభ కధ్యక్షత వహించిరి.

# విద్యావతుల కర్తవ్యం

ం ం ం ం

శ్రీ పునుగుపాటి రామకృష్ణారావు

ఏ సంఘమైనా అభివృద్ధిలోనికి రావడానికి కారకులు స్త్రీలు. స్త్రీ ఉత్తేజం కలిగించకపోతే పురుషుడి పరాక్రమం వృథా. స్త్రీ తగిన ప్రోత్సాహం చేయకపోతే పురుషుడి మేధావత్వం బూడిదలో పోసిన పన్నీరు. జిజాబాయి అనే వీరవనిత లేకపోతే శివాజీకి చరిత్రలో తావేలేదు. పద్మావతి అనే పతివ్రత, నాట్యకళానిధి కలుగకపోతే జయదేవుడి గీతగోవిందకావ్యానికి ఆ సొగసు, అతని అష్టపదులకు అంతవ్యాప్తి, చిరకీర్తి ఉండేవేకాదు. సంఘంలో ఆదర్శవనితలు ఉంటే చాలు సంఘం ఆదర్శరూపం తాలుస్తుంది.

ప్రస్తుతమున భారతీయ సంఘంకూడా మహావ్యక్తులతో నిండడానికి ముందు భారతీయ మాతలు ఉత్తమ మాతృస్వరూపాన్ని దాల్చాలి. పిల్లలకు ప్రప్రథమంలో తల్లి యివ్వాలి శిక్షణ. తర్వాత గురువు. భర్తలు ఆదర్శమైన కార్యాలు చేయడానికి, భార్యలు ఆదర్శమైన విధానంలో ఉత్సాహాన్ని ఉద్రేకాన్ని కల్పించాలి. అట్లాంటి ఆదర్శకత్వాన్ని గుర్తించాలి అంటే స్త్రీలు ముందు విద్యావతులు కావాలి. విజ్ఞానవతులు కావాలి.

దేశంలోఉన్న స్త్రీలు, అందులోనూ బిడ్డలతల్లులు విద్యావతులు కావాలి అంటే ఉన్న కొద్దిమంది విద్యావతులు తీవ్రమైన కృషిచేయాలి. విద్యావతులు ముందు ఒక సంఘంగా ఏర్పడాలి. ఆ సంఘంలో ప్రతీవారు ముందు 'యింటగెలిచి రచ్చగెలవ'మన్నట్లు తమ యింట్లోఉన్న అమ్మలకు, అమ్మమ్మలకు విద్యపైన అభిమానం, అభిలాష కలిగేటట్లు చేయాలి. ఏ భారతరామాయణాలైనా చదవడానికి ముఖ్యంగా కొంత విద్యకావాలి. అదిలేని మనుష్యజీవనం పశుప్రాయం అని వారు గ్రహించేటట్లు చేయాలి విద్యావతులు ప్రథమంలో. అంతేకాని, "మేఘం పార్కులలోకి పోతామా? మగవాళ్లతో చేయి చేయీ పట్టుకొని కుషిణీభాషా మాట్లాడుకుంటూ బీచీలకు షికారు వెడతామా? మాకెందుకు చదువు?" అనే తత్వం పోగొట్టాలి ముందు. ఆ ఉద్దేశ్యం వారికి కలుగకుండా ప్రయత్నించాలి. తరువాత తమ శక్త్యానుసారం విద్యనేర్పాలి. దానికీ పద్ధతులు ఉన్నాయి. విద్యావతులు ముఖ్యంగా విద్య అనే పదానికి అర్థం ప్రతీవారు గ్రహించేటట్లు చేయాలి.

ప్రతీవారూ 'విద్య'కు అర్థం గ్రహించాలి అంటే ముందు ప్రతీ పట్నంలోనూ, పల్లెలోనూ మహిళాసంఘాలు ఏర్పడాలి, విద్యావతులుగల స్థలాలలో. ఆ సంఘాలకు ప్రతి యింట్లోంచి సభ్యులను రావించే కర్తవ్యం విద్యావతులదే! సంఘాలలో స్త్రీలకు గృహిణులకు కాలక్షేపం అవడానికి పురాణపఠనం, న్యూస్ పేపర్ రీడింగ్ (News Paper Reading) మొదలైనవి, ఆటలు పాటలు యిత్యాది వినోదాలే కాకుండా కొంతమట్టుకు రాష్ట్రాన్ని గురించి, దేశాన్నిగురించి, ఉత్తమ మాతృ స్వరూపాన్ని గురించీ, భార్యలు భర్తలకడ మసిలే విధాలనుగురించీ అప్పుడప్పుడు వినోదరూపకంగానే లెక్చర్లో (Lectures) నాటకాలో ఉంటూండాలి. శిక్షణ (Descipline) అనేది నేర్పాలి ముందు. అన్ని వయస్సులవారికీ అనువయే వసతులు ఏర్పడాలి సంఘంలో. ఆ సంఘాల మూలకంగా యిళ్లలోవారు విద్యావతులు కావడానికి అవకాశాలు వాటంతట అవే ఏర్పడతాయి.

కాని చాలాయిళ్లలో అందులోనూ పల్లెలలోనూ, చిన్నచిన్న పట్నాలలోనూ ఉండే స్త్రీలకు అసలే వీలుకాదు బయటికి రావడానికి. వారిమాట ఏమిటి? అంటారు. అట్లాంటి పరిస్థితులలో మహిళా సంఘాలు ఒకవిధానం ఏర్పాటుచేసుకొని ప్రతీయింటికివెళ్లి ఆయిళ్లలోని స్త్రీలకు విద్యవలని లాభం, దాని ఆవశ్యకత తెలియజేస్తూ, అప్పుడప్పుడు కథలు చదివి వినిపిస్తూ, న్యూస్ (News) చెప్తూ ఉండాలి. మనకు కూడా విద్యవస్తే బాగుండును అనిపించే ఏర్పాటుచేయాలి. నిత్య జీవనానికైనా విద్య అవసరం అని వారు గుర్తించాలి. ముగ్గులు పెట్టడం, కుట్టుకుట్టుకోవడం మొదలైన నిత్యకర్మవిధానమే కళారూపకంగా కూడా అభివృద్ధి పొందేట్లా చేయాలి.

తర్వాత సంఘంలో స్త్రీలకుగల ప్రత్యేక కర్తవ్యం ఆదర్శ పురుషుణ్ణి తయారుచేయడం అని విద్యావతులు ముందు గుర్తించాలి. తల్లులు విద్యనేర్వడం ఎందుకోసం? తమ పిల్లలను ధైర్యవంతులుగాను, ఉత్సాహవంతులుగాను చేయడానికి. వారికి యేయేవిషయాలలో అభిరుచి (Talent) ఉన్నదో గుర్తుపట్టి వారిని ఆ విధానంగా ప్రోత్సాహం చేయడానికీను. తమ బాలురు ప్రతివొకరు సంఘానికి ఒక్కొక్క విధంగా మూలప్రతిమలు (Models) కావాలి అనేకోరిక ఉండాలి తల్లులకు. దానికి తగిన పూనికతో పని చేయాలి. తరువాత తమ పిల్లలకు ముఖ్యంగా దేశీయతత్వాన్ని నూరిపొయ్యాలి. వారికి స్వతంత్రభావాలు ఏర్పడేటట్లు చేయాలి. అది స్త్రీల ప్రత్యేకవిధి.

మిగతా విధులు సంఘంలో స్త్రీ పురుషులకు సమానమే! విద్యావతులు సంఘంలో స్త్రీలువేరు పురుషులువేరు అనే తత్వం ఏర్పడకుండా ప్రయత్నించాలి ముందు. ఇద్దరూ అమ్మకన్నవాళ్లే! స్త్రీ పురుష సమత్వ సూత్రం సంఘాభ్యుదయానికి, మానవాభ్యుదయానికీ ముఖ్యావశ్యకం. ప్రస్తుతకాలంలో కొన్ని మహిళాసంఘాలు కేవలం పురుషద్వేషిణీ మహారాణీగారికి ప్రతి వచ్చేటట్లు ఉండడం నిజం. అది చాలా అతిశయించిన పద్ధతి. విద్యావతులు తమ విజ్ఞానాన్ని పూర్తిగా వినియోగించి సంఘంలో సమత్వం ఏర్పడేటట్లు చూడాలి. ఏసంస్థలోనైనాసరే స్త్రీలకు ప్రత్యేకస్థానాలు కోరడం అనవసరం. చేతనైతే ఉన్నవాటిని రద్దు చేయించాలి. ఈ సౌమ్యభావమే ప్రతీ స్త్రీ హృదయంలోనూ కలగాలి, అంటే కొంత విజ్ఞానం కలిగించే మోక్షదాతలెవరు, విద్యావతులుగాక?

కాబట్టి తమరు విద్య నభ్యసించడం కాలం వెళ్లబుచ్చడం కోసమనీ, లేకపోతే, నాలుగురూపాయిలు గడించడంకోసం అనీ తలంచకుండా విద్యావతులంధరూ విజ్ఞానార్థమై విద్య నభ్యసిస్తారని, తమ రార్జించిన విద్యను అడవిగాసిన వెన్నెలగాచేయక ఒకరికి నేర్పి దేశంలోఉన్న యితర స్త్రీలనుకూడా విద్యావతులుగా చేసి దేశాభ్యుదయానికీ, స్వతంత్ర సంపాదనకు ప్రథమ సోపానం కల్పింప చేస్తారని నా ఆశయం.

# వరకట్న ప్రహసనము

శ్రీమతి దేశిరాజు భారతీదేవి

కృష్ణా :-హల్లో గోపాల్ రావ్!
గోపాల్ :-(తిరిగిచూచి) నీవా కృష్ణా?
కృ :-ఎక్కడనుండి వస్తున్నావు?
గో :-యిక్కడొక వకీల్ కూతురుందిట, నిన్న మా అమ్మ చూచివచ్చింది. నేను కూడా చూస్తేనేగాని వల్లగాదన్నారు. అందుకని వెళ్ళివస్తున్నానురా.
కృ :-పిల్ల బాగా వున్నదిరా?
గో :-ఆ బాగానే యున్నదిగాని వాళ్లు కట్నమేమీ యిచ్చేట్లు కనబడలేదురా.
కృ :-పిల్ల బాగున్నప్పుడు కట్నమివ్వరని మానుకుంటావుట్రా! వాళ్లివ్వకపోతే నీకేమన్నా డబ్బుతక్కువా?
గో :-ఏమిట్రా యీకాలంలో కట్నం లేకుండా పెండ్లి జేసికోవడంకంటే తెలివి తక్కువతన మింకోటిలేదు.
కృ :-అయితే మా టీచరుగారమ్మాయి వుంది. బాగా చదువుకున్నది కూడాను. చేసికొంటావా?
గో :-అంటతప్పేలాలు తోముకుండే ఆడదానికి చదువెందుకురా? నాక్కావాలిసింది కట్నం.
కృ :-అయితే పోష్టు మాష్టరుగారి పిల్లవున్నది. వాళ్లు నీ తాహతుకు తగిన కట్నమివ్వగలరేమో కావి.
గో :-కాని యేమిటిరా కనుక్కో. ఐదువేలిస్తే చేసుకుంటాను.
కృ :-సరే కట్నాని కేమిగాని వాళ్ళకు మంచి మర్యాదా పేరు లేదురా?
గో :-ఆ సింగినాదంకాదూ? వాళ్ళ మర్యాదాతో మనకేమి పని? యెంత మర్యాదా లేనివాళ్లైనా అల్లుణ్ణి అమర్యాదా చేస్తారా యేమిటి? విచారించు. నేనువెళ్లి మా అమ్మతోకూడా చెప్పుతాను. (వెళ్లును)

చక్కదనమును లెక్కసేయక, పరువు మర్యాదల పాటింపక, విద్యా వైదుష్యముల విచారింపక కేవలము ధనాశా పీడితుండైన గోపాలరావు మూఢత్వానికి కృష్ణారావు మనస్సు చివుక్కుమన్నది. గోపాలరావు విద్యావంతుడే. అయితేనేమి? విద్యచేత సంస్కరింపబడే హృదయము కాదతనిది. ధనవాతావరణములో బెరిగి యెల్లప్పుడును ధనమే పావనమని తలంచు తలిదండ్రుల పెంపకముచే గోపాలరావు హృదయమున యున్నతాశయాలేమీ యేర్పడలేదు. లంచాలు బాగా స్వీకరించి లక్షలుగడించి చనిపోయిన తహసీల్దారుగారి యేకపుత్రుడు గోపాలరావు. అతనితల్లి దుర్గమ్మగారు భర్త యుద్యోగముచేసే రోజుల్లో తమయింటి కెవరేని బీదవార్యరుదెంచినచో మాట్లాడక మిన్నకుండెడిది. భాగ్యవంతు లేతెంచినచో సోఫాలు కుర్చీలు వేసి కూర్చుండబెట్టి మాట్లాడేది.

ఆ మాటలైనను వారు ధరించిన దుస్తుల వెలలగూర్చియు, వారినగలు గూర్చియు, వారెక్కివచ్చిన కారును గూర్చియు ముచ్చటించును. తనకున్న వస్తువులజూపియు మురియుచుండెడిదిగాని యన్య ప్రసంగములతో కాలమును వృధాచేసేదిగాదు. ఆ తల్లి పెంపకమే గోపాలరావు. ఏగూటిచిలుక ఆ పలుకేగదా; ఇపుడు దేశముయొక్క పరాధీనతను గూర్చిగాని, బీదజనుల బాధలగూర్చిగాని సంఘములోజరుగు దురాచార

ముల గూర్చిగాని ఆ మాతా పుత్రు లెన్నడును దలపోయరు సరిగదా! ధనికుల భూషించుట నిర్ధనికుల దూషించుట వారి నిత్యకృత్యములలో నొకపనిగా నేర్పరుచుకొన్నారు.

పాఠశాలయందు సైతము తాను గొప్పవాడుగావున నలుగురిలో గలసి మెలసి యుండక చాలా బెట్టుసరిగా యుండేవాడు. కృష్ణారావనే యువకుడుమాత్రము కొలది పరిచయమైనాడు. కృష్ణారావు వస్తుతః కుశాగ్రబుద్ధి గలవాడు. దానికి తోడు తలిదండ్రులుగూడ సంస్కరణాభిలాషులై యున్నతాశయులు గలవారు కావున యాతని హృదయ మెల్లపుడును దేశహితైక తత్పరత్వమును, సత్కార్యాసక్తముసైయుండెను. కావున యెట్లాగైనా గోపాలరావునుగూడ తన మార్గములోకి తేవలెనని కృష్ణారావు పట్టుదల.

౨

కృ :-గోపాల్, యిరుగో వీరే పోష్టు మాష్టరుగారు (అంటూ కూడా ఒకమనిషిని వెంటబెట్టుకొని ప్రవేశించాడు కృష్ణారావు)

గో :- (ఆనందముతో) అట్లాగా. యీ కుర్చీమీద కూర్చోండి. మా అమ్మను కూడా పిలుస్తాను. (వెళ్లును)

సూర్య నారాయణరావు :-కృష్ణారావు చాలా చిత్రమైన వాడల్లేయున్నాడు. పిల్లవాడు.

కృ :-మీ కెందుకు? అడిగిన వాటి కన్నిటికి తలవూపండి నేనున్నానుగా ?

(గోపాలరావు, దుర్గమ్మలు ప్రవేశం)

గో :-మా అమ్మగారు పిల్లను చూడవలసిన పని లేదంటున్నారు. యిక కట్నంసంగతే మాట్లాడవలసింది.

సూ :-సరే యిక నేమాటంకమున్నది? అందుకొప్పుకొనే వచ్చాను.కృష్ణారావన్ని సంగతులు చెప్పినాడు. ఐదు వేలకన్నా యెక్కు వియలేను.

దు :-మీకు వక్కతే ఆడపిల్ల. దానికి లాంచనాలైదు వందలిప్పించమను కృష్ణారావు.

సూ :-అబ్బో ఐదువందలే! అంత భరించలేనండీ.

దు :-మాకే వందమంది లేరు. మా కీ యిద్దరే పిల్లలు. దాని యిష్టప్రకారము ముచ్చట్లన్ని వాడిపెళ్లికే జరగాలిగాని యింకో విధముగా యెట్లాజరుగుతవి. దాన్ని చిన్నచూపు చూస్తే వల్లగాదు. అంత భరించలేకపోతే మాకు సంబంధాలు చాలా వస్తున్నాయి.

కృ :-బాబుగారు! మీకూడా వక్కపిల్లే గనుక యెటుతిరిగి నాలుగు వందలకు లోపిస్తే బాగావుండదు కానీయండి.

సూ :-సరేనమ్మా తమ యిష్టప్రకారమే కానివ్వండి.

దు :-అయితే లగ్ననిశ్చయము జేసి పురోహితుని మా యింటికి పంపండి. 'అన్నగారూ: కాస్త వ్యవధి చూచి లగ్నం యేర్పాటు చేయండి. మా కూడా కాస్తో కూస్తో పనులుంటాయికదా: అదీగాక మా అమ్మాయి దూరదేశములో గూడా వున్నది.

సూ :-సరేలేండమ్మా. శలవా ?

దు :_మంచిది.

సూ :_యింకొక్క సంగతి. మా అమ్మాయికి చాలా జబ్బుచేస్తే మంగళగిరి కొండమీద పెండ్లిచేస్తామని ముడుపు గట్టి దణ్ణంబెట్టుకొన్నది తల్లి. మీరక్కడకు రావాలి.

దు :_అబ్బో అట్లాగైతే మాకు చాలాఖర్చండీ. రైలు ఖర్చులు మీరు భరించేట్లయితే మా అభ్యంతర మేమీ లేదు.

సూ :_(వస్తూన్న నవ్వాపుకొంటూ) అయ్యో! మేమే కాదుటండీ భరించవలసినవాళ్లము?

దు :_అయితే సరే. (అందరూ లేస్తారు)

కృ :_ఏమోయి గోపాల్! పిల్లనేమైనా చూస్తావా?

గో :_అక్ఖ్లరేదు.

3

సూ :_మన సుగుణకు పెండ్లి మనుము కుదిరింది. అబ్బబ్బా తిరిగితిరిగి కాళ్లు పీక్కపోయినయి.

(మంగమ్మగారు వంటింట్లోనించి చెయ్యి తుడుచుకుంటూ ప్రవేశించి ఆత్రంగా)

ఎక్కడ?

సూ :_యీవూళ్ళోనే. మన వేణుతోకూడా చదివేవాడే గోపాలరావనే పిల్లవాడు. అతనికే నిశ్చయించాను.

మం :_ఆ యేమిటి! వాళ్లు నేలమీదనడుస్తారే? మన కాపాటిశక్తిలేదుగా? లేనిపోని ఆడంబరాలకుపోయి అప్పులుదెచ్చి పెండ్లిజేస్తే యెట్లా తీరుస్తారుమళ్లీ? వియ్యానికైనా కయ్యానికైనా సమానంగా వుండాలన్నారు పెద్దలు. మన తాహతుకు తగినవాళ్లెవరూ దొరకలేదా? యేమాత్ర మడిగింది దుర్గమ్మగారు?

సూ :_ఐదువేలకట్నం. వెండిచెంబు, వెండివిస్తరి, గిన్నె, పట్టుబట్టలు, ఆడబడుచు లాంఛనా లైదువందలు షుమా రారువేలు.

మం :_అయ్యో! అయ్యో! యెంత విపరీతమండీ. ఒప్పుకున్నారా?

సూ :_ఆహా తప్పుతుందా? మనవసరమా? వాళ్ళవసరమా?

మం :_సరేగాని డబ్బెక్కడనుండి తెస్తారు? దొడ్లో చెట్టేమన్నావుందా రూపాయలు దులిపి తేవడానికి? యెట్లా ఒప్పుకున్నారండి?

సూ :_పెండ్లివారు మంగళగిరి రావడానికయ్యే ఖర్చులుకూడా ఒప్పుకున్నాను, భగవంతునిమీద భారమేసి మన శక్తివంచనలేకుండా యేలోటు రాకుండా చేస్తాము.

మం :_సరిసరి. బాగాయున్నది. అంతేనా? యింకేమన్నానా?

సూ :_(నవ్వుతూ) యేమీలేదు. యిక పనులు ప్రారంభము చెయ్యవచ్చుగదా? మనుష్యులను మాట్లాడి త్వరగా వడియాలువగైరా పూర్తిచేయించు, త్వరలోనే లగ్నం బెట్టే యేర్పాటు చేస్తాను.

మం :_సరే.

మ:-అబ్బాయీ. అక్కయ్యకి విషయాన్ని త్వరగా వ్రాయరా, యిక తొమ్మిదిరోజులేకదా లగ్నం. యీ లోగా బావ శలవబెట్టి రావాలిగదా. వాళ్లకు కాస్త వ్యవధిలేకుండా తెలియజేస్తే యిబ్బంది పడుతారురా.

గో:-వుత్తరమేగాదమ్మా టెలిగ్రామిస్తాను. త్వరగానే వస్తారు వాళ్లు.

మ:-సరేగాని నాయనా! అలకవేళ మామగార్ని మరో ఐదువందలన్నా అడగాలి. అంతకు తక్కువైతే నాగవల్లికి రానని బెట్టుచెయ్యి యిస్తారు.

గో:-వుండవమ్మా ముష్టి ఐదువందలేమిటి? నేను మోటారుకారు అడుగుదామనుకొంటూన్నాను. కనీసం మూడువేలైనా బెట్టంది కారు రాదు.

దు:-ఏమో అంత ఖరీదుగనుకనే యివ్వరేమో!

గో:-ఆ యివ్వకపోతే చూడు నామజా. యెట్లా డబ్బువదిలిస్తానో ఆయనకు? పోస్టువేళైంది వెళ్లివస్తాను.

(వివాహమంటపము; వధూవరులు తదితర పెద్దలు)

సూ:-శాస్త్రుర్లుగారు! యింకెందుకాలస్యం సూత్రధారణ గానివ్వండి.

శాస్త్రి:-పంతులుగారు! వియ్యపురాలుగారేదో శలవిస్తున్నారు.

దు:-(లోపలనుండి) ఐదువేళ్ల కట్నంలోను అయిదు పయిసాలైనా బాకీబెట్టడానికి వీల్లేదు, మొదట వప్పుకున్నప్పుడు మాకిట్లా చెప్పారా?

సూ:-అక్కగారు! క్షమించండి. రావలసినపైక మందలేదు. వెయ్యిన్నూట పదహార్లు యిప్పుడే యిస్తున్నానుగదా. మిగతా నాలుగువేలు నెలలో యిచ్చేస్తాను. కళ్యాణమును కానివ్వండి.

దు:-వల్లగాదు. యిదంతా శుద్ధమోసములాగ కనబడుతూంది. నమ్మడానికి వీల్లేదు, అంత కట్నంవప్పుకున్న వారు డబ్బు చేతిలోలేకుండా యింతదూరం యెట్లావచ్చేరు? యిదేమి వంకాయలబేరమా! రేపిస్తాము యెల్లుండిస్తామని త్రిప్పడానికి; యిప్పుడు యిస్తామన్నడబ్బు సాంతమిస్తేనే పుస్తెముడి పడుతుంది లేకపోతే లేదు (కోపముతో) గోపాల్ లేచిరా యిటు!

గో:-(లేచి నిలబడతాడు)

సూ:-(కృష్ణారావువంక చూస్తాడు)

కృ:-(ప్రక్కనున్న స్నేహితుడికి సైగచేస్తాడు)

(స్నేహితుడు క్రిందపడుతాడు. అందరూ హడావిడిగా పెద్దగోలచేస్తారు. మూర్ఛపోయినాడని కొందరు, కాదని గొందరూ, అంతా గల్లంతు)

కృ:-పంతులుగారూ కొంచెము నీళ్లుతెచ్చి ముఖాన చల్లాలి. మూర్ఛేమో!

(స్నేహితుడు కళ్లుతెరచిచూచి గ్రుడ్లు పెద్దవిజేసి గడగడ వణుకుతాడు)

శాస్త్రుల్లుగారు :-(గాభరాగా) ఏమండోయి కాస్త సాంబ్రాణిపొగ వెయ్యండి

కృష్ణారావు త్వరగా కాస్త నిప్పుదెచ్చి సాంబ్రాణివేస్తాడు. పెళ్లికొడుకు భయంతో వణకిపోతు న్నాడు. దుర్గమ్మగారు మంగమ్మగారు మొదలైన స్త్రీలంతా భయపడుతారు!

పడిపోయిన మనిషి లేచి గంభీరంగా మాట్లాడుతూన్నాడు.

ఒరేయి నేనెవర్ననుకున్నావురా, నేనీ గిరిపై నివసించియున్న స్వామిని తెలుసునా! (గోపాల్ వంక చూస్తాడు. గోపాల్ భయంతో దణ్ణం బెడుతాడు). నేను దేముణ్ణని తెలియదుట్రా ?

గో :-తెలుసు స్వామి! (వీరావేశముతో)

స్వామి :-నీకు దేముడిమీద భక్తియున్నదిరా ?

గో :-వున్నది స్వామి.

స్వా :-అట్లా అయితే నే చెప్పినట్లు చేస్తావా!

గో :-చేస్తానుస్వామి.

స్వా :-నా సన్నిధిలో నిట్టి అక్రమకార్యాలు అధర్మాలు జరుగకూడదని తెలియదట్రా ?

గో :-యిప్పుడే మధర్మము జరిగింది స్వామి ?

స్వా :-(రోషముతో) ఏమా; ఏమని ధైర్యంగా అడుగుతూన్నావు? నా నిర్మితమైన ధర్మశాస్త్రాల్లో నిన్ను కట్నం పుచ్చుకోమని రాసివుందా ?

గో :-(మాట్లాడడు)

స్వా :-ఏమిరా మాట్లాడవు? (అని మీదకు దూకుతూన్నాడు)

గో :-(భయముతో) లేదుస్వామీ లేదు.

స్వా :-నా సమక్షములోనే నా గిరిపైనే యిట్టి అక్రమకార్యము జరుగుతూంటే చూచి సహిస్తాననుకున్నావూ? దేముడంటే వట్టి రాతివిగ్రహమే ననుకున్నావు, పీటలమీద పెండ్లి విడిచి పోతావు? నీవు కట్నం దమ్మిడీ అయినా పుచ్చుకోకుండా యీ పిల్లను చేసికోకపోతివా నీప్రాణం దక్కదు.

గో :-(తల్లివంక చూస్తాడు)

స్వా :-ఏమిరా నీకింత నిర్లక్ష్యమా ? (జుట్టు బట్టుకొంటాడు)

గో :-స్వామీ స్వామీ! చంపకు చంపకు. మీయాజ్ఞా నెరవేరుస్తాను. నే నెప్పుడూ కట్నం తీసుకోను.

స్వా :-యిప్పుడిచ్చిన వెయ్యి రూపాయలుకూడా యిచ్చేస్తావా?

గో :-యిస్తాను స్వామి.

స్వా :-(సూర్యనారాయణ వంక తిరిగి) ఓరి నీవెప్పుడైనా యింకో అల్లుడికి కట్నమివ్వడముగాని నీ కొడుక్కు పుచ్చుకోవడముగాని చేస్తావా?

సూ :-లేదు లేదు స్వామి. యెవ్వరికీ యివ్వను. నాకు డబ్బంటే గాదూ యిచ్చేందుకు ?

గోపాల్ జుట్టు యింకా స్వామి చేతులోనే యున్నది. దుర్గమ్మగారు పరుగు పరుగున వచ్చి స్వామికి నమస్కరించి 'స్వామీ నా అపరాధాన్ని సైరించి నాకు పుత్రభిక్ష పెట్టు. నేను నీ యాజ్ఞను శిరసావహించి కట్నం పుచ్చుకోకుండా పెండ్లిచేయిస్తాను, నీకు నాలుగుబిందెల పానకముచేయించి సహస్రనామార్చన చేయిస్తాను తండ్రీ' (కళ్లనీళ్లు కారుస్తుంది)

స్వా :–దుర్గమ్మా నీభక్తికి మెచ్చాను. అట్లే నీపుత్రుని దీసికొమ్మ. కాని భగవంతుడనే వాడున్నాడని, అక్రమ కార్యాలను నెరవేరుస్తాడని అనుకోనబోకుము. యిదిమొదలిచ్చట నున్న వా రందరూ కూడా యిది మొదలు కట్నాలకు ప్రోత్సాహ మిచ్చినట్లయితే నా కోపాగ్ని జ్వాలలో దగ్ధ మొనర్చెదను. (కన్నులెత్తిజేసి క్రింద పడిపోతాడు)

అందరూ ఏకగ్రీవముగా స్వామికి నమస్కారములు చేశారు. వివాహము లక్షణముగా జరిగి పోయింది.

సూర్యనారాయణరావుగారు కృష్ణారావు తెలివితేటలకు నాడు తనకొనర్చిన యుపకారానికి మిక్కిలి అభినందించాడు. మీవాళ్లు కట్నమివ్వలేదని కోడల్ని చెప్పితే నరసింహస్వామేమిచేస్తాడో నన్నభయంతో దుర్గమ్మగారు కోడల్నేమీ అనేదిగాదు.

---

## —— వికసిత కుసుమము ——

విచ్చని మొగ్గను
వికసించితిగా,
పత్రులవన్నీ
పడిపంచలెగా?

తాకగ వచ్చును
తగదని జెప్పదు
తరలే పోవును
తక్షణ మొచ్చును?

గోటితొ త్రుంచీ
ముక్కులొ బెట్టీ
రెక్కలు విరచీ
అనాధ జేతురు?

దినదిన మెదిగెడి
దివ్యశరీరము
యేరికి నిత్తును
యేహ్య మెరుంగకె?

పొదలో బుట్టిన
పువ్వే గద యని
పొందగవచ్చును
పందలు భువిలో?

ఆపయి నెట్లని
యాలోచించరు
మెదడొకటుంటేనా,
మొకములకూ?

—వల్లభనేని రంగాదేవి.

(శాస్త్రి విశ్వనాథంగారి "సంస్కారం" అను యముద్రిత గ్రంథమునుండి)

# కవిజీవితము

శ్రీ యు. అనంతాచారి

ఆంధ్ర వాఙ్మయరంగమున, కవి, తనకాలమున నిర్వహించినభూమికలు ఇన్ని అన్ని అని చెప్పలేము. సాంఘికసంధ్యలయందు, శాపానుగ్రహసమర్థుడైన అలఘుశక్తియుతుడాతడే. కళింగగంగు, శాపగ్రస్తుడై, గద్దియ దారబోసుకొని, వాడవాడల యాచించెడి భిక్షువగుట, ఆ భీమకవి కోపకారణమే. తదనంతర కాలమున ఆ కవియందలి దైవరాణి, దిగబారి, గంభీరత, గౌరవములు ప్రవర్థమానమగుట సుగోచరము. శాస్త్రములందును, ఆచారములందును ప్రతిభాపూర్ణుడైన ఆచార్యుడతడు. ఇందులకు సాదృశ్యమా నన్నయభట్టే.

కవి, ఇంకను ఉన్నతపదవుల నధిష్టించుటగాంతుము. అతడు సింహాసన మలంకరించును. నన్నెచోడ పెద్దభూపతి, కృష్ణదేవరాయాది రాచకవులను, నొకచేత కలమును, మరియొకచేత ఖడ్గమును గల వ్యక్తులుగా నేటి చిత్రకళావేత్తలు చిత్రింపవచ్చును.

ఒక్కమెట్టుదిగిన, అతడే మంత్రి పుంగవుడు-సింహపీఠికకు వెనుకటివ్యక్తి. అమాత్య బిరుదముచే నలంకరించుకొన్న కవులలో తిక్కయజ తలమానికము. సార్వభౌమ సభాభవన ప్రకాశమున స్వీయప్రతిభను ప్రదర్శించినది శ్రీనాథ కవివర్యుడే. పాండిత్యప్రకర్షమున తన్నెదిరించినిల్చిన ప్రతివీరుల గుండెలదరింపజేసి, దిగ్విజయదీక్షితుల తేజరిల్లిన ఈ కవితల్లజుడే పెద్దన పూర్ణహర్షమున చిత్రకారునిముందు తన రూపప్రతిమాలేఖనమునకు ఆసీనుడైయుండుటయందు అబ్బురములేదు. పదునేడు పదునెనిమిదవ శతాబ్దములాదిగా, కవికి గ్రహణయోగము ప్రారంభించెను. ఉన్నతపదవి దొలంగి, పాళెగాళ్ల పంచజేరవలసిన దుస్థితి వారికి సంభవించెను. దైవప్రేరక ఆవేశము, నట్టేట వారిని డించి పోయెను. ఆశుకవిత్వములల్లి సభికుల నానందింపజేయుటే వారికి విధియయ్యెను.

కవితాహృదయము గల రాజకంఠీరవుడా కృష్ణరాయడు. కవికుంజరులతోడి కాలక్షేపమే కడుంగడు ముదంబుగూర్చు కడంకయాతనికి కవినాథుడెవడేని తన కొలువుసొచ్చిననాడు అతని ఆనందమునకు అంతముండదు. అతని మెప్పునందని రసవత్కావ్యము, అతని కలిమి ననుభవింపని కవివర్యుడు, అతని రసనపాలుగొనని కవితాప్రసంగము, మచ్చునకైన యుండియుండవు. రాయలకొలువుకూటమను సారస్వతాంగణము కవులకు విలువగట్టి తత్కవి శిరస్సీమల సత్కారపరంపరల వర్షించుచుండెను. గౌరవ, సత్కార, సత్ప్రశంసలు, రాయలసభ బ్రవేశించు ప్రతి కవిశేఖరుని వరించుచుండెను. ఆయాకాలముల నాచరింపబడు పరిషత్సభలే, నాటి కవులపాలిటి స్వర్గసీమలు. కవికి పాఠక సమర్పితమగు గౌరవము, కీర్తి, కృతజ్ఞతలే పారితోషికములు. అతడు అమరుడు మాత్రమేకాదు, అమరత్వము ప్రసాదింపదగు దిట్ట. ఈ రహస్యము క్ష్మానాథులు చక్కగ నెరుంగుదురు. కవుల బాంధవ్యంబు కావుననే వారికి వాంఛనీయమయ్యె భూపతులెందరో నేటికిని మన స్మృతి పథంబున నుండగల్గుటకు కారణము, కవి వృషభుడొక్కడు ఆ వసుంధరాధిపతికి, తన కావ్యంబు అంకిత మొనర్చుటచేతనే. అట్లుకానియెడ ఆరాజు కాలగర్భమున కలిసి యుండెడిని. ఐహిక భోగానుభూతికి కవి తిలాంజలు లొసంగియుండలేదు. కొండొక కావ్యంబునకుగాని పురాణ గ్రంథంబునకుగాని, కృతిపతిత్వంబు అపేక్షించిన ఆధిపుండు, పారితోషక సమర్పణంబు ముందుగనే చేయుచుండెడిని-కవియుత్సాహాతిశయంబు కొఱవడకుండుటకు-అతడు వస్త్రమూల్య వజ్రవైడూర్య కర్పూర తాంబూలాదుల కవికి అర్పించుచుండెడిని. అప్పుడప్పుడు ఉత్తమకవులు అగ్రహారంబులు సహితము గ్రహించుచుండిరి. కొన్ని

సమయంబుల ఆ సన్మానంబులు నూతన మార్గము ద్రొక్కుచుండెను. "దీనారటంకాలతీర్థ మాడించితే దక్షిణాధీశు ముత్యాలశాల," యని శ్రీనాథుడు వాకృచ్చియున్నాడు. నిష్కాములకంటెను, నిక్షేపము అతనికి నిల్చి నీయకపోయినను రాయల సన్మానమందిన ఆ దినమే అతనికి పర్వదినము తనమెచ్చికోలుదెల్పుటకే, మను చరిత్రం బందుకొనువేళ పెద్దనార్యునివల్ల కరముల బట్టిరెత్తె.

కవులెల్లరూ శ్రీమంతులనియూ, కావ్యనిర్మాణ మొనర్చుటే తడవుగా అగ్రహారాదికంబుల నార్జింప నేర్చిరనియూ తలంచుట గొప్ప పొరపాటు. ఆంధ్రకవికిఁబెట్టని బిరుదము జ్యేష్ఠాదేవి ప్రసన్నతయే. ఈ పేదతనమే ప్రపంచమందలి కవికులాలంకారుల సమానత్వమును సిద్ధింపజేయుచున్నది. స్వీయ కుటుంబ పోషణ కోర్వలేకయే, అయ్యలరాజు రామభద్రకవి, ఆత్మహత్యజేయ నిశ్చయించెను. ఇంటి యజమాను రాలికి అద్దనిచ్చుటకే శంకుసాల నరశింహకవి తన పద్దెముల నడువీధి నమ్మవలసివచ్చె. ఆ కవి కడుంగడు కష్టజీవితంబు గడపవలసివచ్చె.

శ్రీనాథ, పినవీరభద్ర, ధూర్జటికవులు అప్రతిహతవిధిని తమ యౌవనమును వెళ్ళబుచ్చిరి. వారు నిక్కవముగా విలాసవంతులే. వారు జీవితమందలి చేదుతీపులను తుల్యమనస్కతతో ననుభవించిరి. ఒకనాడు పంచభక్ష్యపాయసంబుల మెసవిరి. మరియొకదినము నిట్టుపాసంబు సల్పిరి. శ్రీనాథుడు ఉక్కుసంకెలల తోడను, పెద్దన అశ్రుకణంబులతోడను, వారి జీవిత చరమదశయందు మనకు ప్రత్యక్షమగుచున్నారు. ఇది కవి విషాదజీవితమునకు ప్రతిబింబము.

అప్పుడప్పుడు కవి నెదుర్కొను సంధిగ్ధావస్థలు మనకు గోచరించెడిని. తిక్కన ఉచితపదమునకై తికమకపడుచున్నాడు. అతని వ్రాయసకాడు, కుమ్మరియొకడు అతనికి సాయపడుచున్నాడు. పాలుపగు పదము స్ఫురింపక పోతన పాదచ్ఛాయలు వేయుచున్నాడు. అతని ముద్దుకూతురు ఉచితపదమాతనికి అందిచ్చు చున్నది. భారతమునెల్ల, రాజసమ్ముఖమున పఠింపవలసియున్నది. ఒక్క అక్షరమేనియు ఇంతదనుక రచింప బడలేదు. తాళపత్ర సంపుటంబునుగాంచి, పినవీరన పెద్ద నిశ్వాసమును వెలిబుచ్చుచున్నాడు. అతని ప్రణయాధిదేవత, అమర్యాదనుండియు, అవమానమునుండియు అతనిని కాపాడుచున్నది.

మోదాంత సన్నివేశంబులు సయితము తనకు తాన కవిపథంబున సంభవించుచుండెడిని. నిజ నాథుని కోపవీక్షణమునకు గురియైన పట్టమహిషి, కవిమాధ్యస్థతను అభిలషించుచున్నది. రాజదంపతుల ప్రేమ కలహమును సమన్వయింప, ముక్కుతిమ్మన పారిజాతాపహరణమును రచించుచున్నాడు.

వీధికెక్కి నృశింహకవి పద్య కుసుమంబుల విక్రయింప పూనుచున్నాడు. నగరిమేడమీది గవాక్షి తెరువబడుచున్నది. రాజకుమారి మూల్యమేమని ప్రశ్నించుచున్నది. పద్యపాదమునకు పదినూర్లని ఉత్కర్షతో కవి పలుకుచున్నాడు. తత్క్షణము, మూల్య మిచ్చివేయబడుచున్నది. కడుపెండిపోయిన కవి, ఇంటి ముఖము మరలుచున్నాడు. మోయరాని మొహరీలమూట మూపున—పెదిమెలపై ప్రశంస—హృదయమున హత్తిన రాజపుత్రికరూపము.

అతనికి హర్షప్రదాయకమగు సమయంబులును వున్నవి. చాటువులందు చమత్కారము చూపి, సంతసపడుచుండును. క్లిష్టపద బంధనంబును, నేటి పాఠకుడు ఎంత పట్టుదలతో ఛేదింపగల్గునో అంతటి శ్రద్ధతో సమస్యపూరణంబుల అత డొనర్చుచున్నాడు. వారిలోకెల్ల అగ్రగణ్యుడైన వికటకవిని—తెనాలి రామకృష్ణుని మన మెరుగమా?

# శ్రీ చైతన్య మహాప్రభువు

శ్రీ పూర్ణానంద

రూపము రూపుఁదాల్చెనను రూఢినిఁదోపగఁ జేయుమూర్తి ఈ
పాపకళంకితంబగు ధరాతలమందు పదమ్మునుంచ ల
జ్జాపరితప్తమానసుడు చంద్రుడు మోమునుఁదాచె, జాహ్నవీ
ఆపగ వేగసంచలితమయ్యె మహాహరిశబ్దఘోషలన్

అలసటలేక ధూర్తుడగు ఆసుకుమార కుమారమూర్తి వా
డలనొనరించు అల్లరి తటాలున గుర్తుకుదెచ్చు మున్ను గో
కులులకు ధన్యతాపదము గూర్చిన చిన్నని సంగతిన్ సుధా
పులకిత హాస్యవీధులఁ దపోఫలభోగ మొనర్తు రందఱున్

పూ జయకీర్తి దీధితుల మాయగ జేతురో తళ్కువెట్టువా
రో? జయలేఖలం గని విరోధము మానుడటంచు పల్కువా
రే జయమందు కోర్కెలు విలీనమవన్ నతశీర్షులౌచు వి
ద్యాజలరాశి, 'వాదిహరి' యంచును మెచ్చిరి వాని ప్రోడిమిన్

ఇంతలొ మాధవేంద్రపురి ఏమి రహస్యముఁ జెప్పెనో కటా!
వింతగ సర్వసంగముల వీడెను నామజపంబె ఈ కలిన్
శాంతినిఁగూర్చు ఔషధ మటంచు జగమ్మున సాటె శిష్యులా
శాంత మనోహరాకృతికిఁ జంచల చేతముఁ గాన్కనియ్యగా.

ఆ కడగంటిచూపుల కహంకృతి కల్పన విచ్చిపోయె పా
పాకులితాంతరంగ పశుపాశ విమోచన ధర్మమేఘముల్
పాకెను శాంతివర్షమునే భారత భూమిని, జల్లపర్చుచున్
నాక నిగూఢ నిర్వృతి వినా శ్రమ హస్తగతం బొనర్చుచున్.

# ప్రేమజ్యోతి

శ్రీ ఫక్కి సూర్యనారాయణ శాస్త్రి



ఇదేం పాపమండీ శాయమ్మప్పయ్యగారు! రేయిం బగళ్లు అలా యేడుస్తా వుంటారూ; ఆ బుల్లెమ్మ గారు బెదిరి పోయి మీ దరికైనా రాకుండా తిరుగు తున్నారు. చచ్చినారితో చస్తామటండీ? ఉన్నారిని చూచుకోవాల గానీ? అని పెద్ద కుమారుఁడును రెండవ కూతురున్ను అప్పటికి నాలుగు నెలల కిందట పదిహేనురోజులు యెడంలో చనిపోయినందున దుఃఖ పడుతూ ఉన్న శాయమ్మను రాచ రంగమ్మ ఓదారుస్తూండగా అక్కడకు జాజి పరుగెత్తుకొని వచ్చి అమ్మా! అమ్మా! బావొస్తున్నాడే అని మఱల వీథిలోనికి పరుగెత్తుకొని పోయి బావా! మన - మల్లిపందిరిలే చాలా పువ్వులు పూస్తూంది బావా! రోజూ దండలు గుచ్చి నేను జడలో పెట్టుగుంటున్నాను. నిన్న నువ్వొస్తావేమో అని పెద్ద దండ గుచ్చి దాచాను. నువ్వు రాలేదు. రా బావా! మల్లెచెట్టు చూద్దామూ అని మేనమామ కుమారుఁడైన దినమణిని చేయి పట్టుకొని లాగ నారంభించింది జాజి. 'నడిచే వొచ్చావుట్రా నాయనా? చదువుకుంటున్నావా?' అని శాయమ్మ దినమణిని పల్కరిస్తూండగానే జాజి దినమణులు మల్లిపందిరి వద్దకు పోయారు.

వేసవికాలము. వైశాఖమాసము. సాయంకాలము. సూర్యుడు చెట్ల ఆకులకును వెల్ల చరచిన గోడలకును బంగారపు లేఁబూత పూస్తున్నాడు. పక్షిపిల్లలు తమ గూళ్లలోనుంచి తలలు పైకిఁ బెట్టి తల్లుల రాకకై జూస్తున్నాయి. వస్తూన్న మేకల మందలకు యెదురుగా పరుగెత్తుచు మేకపిల్లలు 'మే, మే' అని అరుస్తూ మేమే మీ పిల్లలమని తల్లులకు జవా బిస్తూన్న ట్లున్నాయి. మల్లిపందిరి కింద నిలుచున్న జాజి జడలో దినమణి మల్లిమొగ్గలు పెడుతున్నాడు. బావా! పొద్దుగూకి పోతుంది. ఇంక చాలు బావా! అన్ని పువ్వులూ నాకే పెడతావూ_ నీకు దండ గుచ్చాలి; అవి ఉంచు బావా! అని జాజి దినమణి చేతులు పట్టుగున్నది. జాజికి తొమ్మిదేళ్లు వెళ్ళాయి. దినమణికి పన్నెండోయేడు. జాజిని ముద్దు పెట్టుకున్నాడు-దినమణి. ఎవరేనా చూస్తారు బావా!

"ఏం జేస్తున్నావే? రాజ్యం! బావేడీ?"

"ఇక్కడే ఉన్నాడు. పువ్వులు కోస్తున్నాడు."

"శాయమ్మప్పయ్యగారూ! మొగుఁడూ పెళ్లాలు సరసా లాడుకుంటున్నారు. రండీ! చూడండీ!" అని రాచ రంగమ్మ తమ దొడ్డిగోడవద్ద నిలుచుండి కేకేసింది. జాజి ఒక్క పరుగున యింట్లోకి పోయింది.

"అమ్మా! నువ్వూ నాన్నా నన్ను "రాజీ" అని పిలుస్తారేమే?"

"నీ పేరు రాజ్యలక్ష్మమ్మ. మేం అంతా "రాజీ!" అని పిలుస్తుంటే చిన్నతనంలో బావకి 'రా' పలకక "జాజీ!" అనేవాడు. అందరూ అలాగే పిలవడం మొదలుపెట్టేరు."

"అలా అయితే నాకు జాజి పేరే బాగుందే అమ్మా!"

దినములు గడుచు చున్నవి. జాజికి పదేళ్లు దాటినవి. ఆ పిల్లతండ్రి ఛాందసుఁడు. కోపిష్టి. ఒక నాడు జాజీ దినమణులు మంచము మీద పడుకొని కథలు చెప్పుగుంటూ ఉన్నారు. జాజితండ్రి వచ్చి ఒరే! మణీ! చెంబెడు నీళ్ళట్రారా కాళ్లు కడుక్కోడానికీ - అన్నాడు.

"మంచి కథ చెబుతున్నాడు నాన్నా! నువ్వు తెచ్చుకో నాన్నా!" అంది జాజి.

"నీ మొహం, నీకు వాడు కథలు చెప్పడ మేమిటి? లే, లేచి అమ్మ దగ్గరికి పో"

జాజి వెళ్లిపోయింది.

"ఏంరా! నీళ్లు పట్రావేం?"

"నే నెందుకు తెస్తానూ? నన్ను కథ చెప్పొద్దంటేనూ?"

"అరి గాడిదా! నీ కెంత పొగరుబోతుతనంరా"

"అదేమిటి నాన్నా! బావని గాడిద అంటావూ? వాడికి కోపంవొస్తుంది. నీళ్లు నే తెస్తాలే."

జాజి తండ్రి పేరు రామగోవిందదీక్షితులు. ఉదయం సాయంకాలాను నాలుగు బిందెల నీళ్లు కావాలి, కాళ్లూ చేతులూ కడుక్కోవడానికి అతనికి. మొగ్గ లోపల విడుస్తూన్నట్లు జాజీ దినమణుల మనస్సులలో ప్రేమనే మొగ్గ వికసిస్తుంది. దీక్షితులు కూతురికి సంబంధం వెతుకు తున్నాడు. శాయమ్మ మనవడూ మనమరాలూ దంపతులైతే చూడాలని గంపెడాశలో ఉంది. దినమణిని చూచి దీక్షితులు విసుక్కోవడం మొదలెట్టాడు. ఒక నాడు దీక్షితులు "మా రాజ్యం మొగుడు యెట్లాగా వుంటాడు. చాల నగలు పెడతాడు. మా అమ్మకి శ్రావణమాసంలో పెళ్లి. రాజ్యం! నువ్వింక మణితో మాట్లాడకేం." అన్నాడు. జాజి తండ్రి మొగం చూచి కళ్ళ నీళ్లు గిఱ్ఱున తిప్పింది. లేచిపోయింది.

"ఏంటోయ్? పిల్లకిష్టంలేని పెళ్లి? వాడికంటే గొప్పవాణ్ణి తెస్తావా ఏమిటీ?" అంది శాయమ్మ.

"నా యిష్టం. నాపిల్ల. కులుకుతున్నావు, మనవడికి కట్టిపెట్టాలనీ. అలా సాగదు" కుతుకులూరుపిల్ల పెళ్లిని గురించి సవాలక్ష గ్రంధం అయింది. అత్తకూ అల్లుడికీ. జాజికి శ్రావణమాసంలో పెళ్లిఅయింది శాయమ్మ యేం జేస్తుంది? అతని పిల్ల? 'నేను చాకిరీ చేయడానికే కాని మాటకు పనికొస్తానా?' అనుకుంది ఊరుకుంది.

జాజీ దినమణులు మునుపటివలె చనువుగా వుండడంలేదు. క్రమంగా మణికి జాజితో మాట్లాడ డానికికూడా జంకు కొంకూ కలిగింది. దగ్గరగా ఉన్న చెట్టుకి అల్లుకో బోతూన్న తీగెను మళ్లించి దూరపు చెట్టుకి అంటగడితే ఆ తీగ యేం జేస్తుంది? ఆ చెట్టునే చుట్టుకొని అక్కడే కాస్తుంది. తోటమాలి బుద్ధి మాలిన వాడైతే యింతేగా.

దినమణి కొన్నాళ్ళు దిగులుగా ఉన్నట్లుండేవాడు. రామగోవింద దీక్షతులుకు పాపం క్షయరోగం. దానివల్ల చాలా బాధ పడుతూ ఉండేవాడు. జాజి కాపరానికి వెళ్ళి రెండేళ్లైంది. కుతుకులూరులో పదిమం దిలోనూ బుద్ధిమంతురాలని పేరు మోసింది. జాజి మగని పేరు శ్యామమూర్తి. మంచి హోయలుకాడు. అతనికొక విధవ అప్పగారుంది. ఆమె కాపురాని కెళ్లడానికి ముందే ముండమోపి కావడంవల్ల అతనివద్దనే ఉంది. ఆమె శ్యామమూర్తి కేమి బోధించిందో శ్యామమూర్తి మళ్లీ పెండ్లాడడానికి నిశ్చయించుకున్నాడు. ఒకనాడతడు భార్యతో 'పిల్లా! నేను మళ్లీ పెళ్లి చేసుకుంటానే. ఏమంటావు?' అన్నాడు. జాజి 'మీ యిష్టం' అంది. ఆరోజుమొదలు ఆమె పున్నమవెళ్లిన చంద్రుళ్లాగ దిగనారఁ జొచ్చింది. శ్యామమూర్తి మళ్లీ పెళ్లాడాడు. అతని రెండోభార్య దుర్గ. సవతి కాపరాని కొచ్చింతర్వాత జాజి భర్తతో రహస్యంగా మాట్లాడి యెరుగదు. పొద్దుట యింటిపనులు సాయంకాలం దుర్గకు తలదువ్వి పువ్వులు ముడిచి తయారు చేయడం; యివి ఆమె నిత్యకృత్యాలు. రంగుచీర కట్టుకోవడం మానేసింది. ఆమె నడవడికి లోకులు ఆశ్చర్యపడేవారు. కొందరు మనస్సులో వుంచుకోలేక 'శ్యామంగారూ! ఆ అమ్మాయిని యిలా అన్యాయం చేయడం మీకు మంచిదికాదండీ. సావిత్రిలాంటి పిల్ల, చక్కనిచుక్క. ఈ కొంకినక్కనోదాన్ని తెచ్చు

గున్నా వెందుకయ్యా? ఆ తల్లి కన్నీళ్లు మీ నట్టింట పడరాదయ్యా! మంచిపని చేశావుకావయ్యా' అనే వారు. అలా అన్నవారికీ శ్యామమూర్తి అప్పుడూ మహాయుద్ధ మయ్యేది. కొన్నాళ్లకి జాజితండ్రి క్షయరోగి కావడంవల్ల ఆ రోగం గలవాళ్ల పిల్లలకు తప్పితే మనమలికైనా ఆరోగం మళ్లీవొస్తుందని డాక్టర్లు అన్నందువల్ల శ్యామమూర్తి ఆమెతో సంబంధం మానుకొని మళ్లీ పెళ్లాడాడని చెప్పుకునేవారు.

ఒకప్పుడు జాజి పుట్టింటికి వచ్చింది. ఊళ్లోవారంతా వచ్చి ఆమెకు తటస్థించిన స్థితికి విచారిస్తూ తమ సానుభూతిని వెల్లడిస్తోంటే ఆమె కొయ్యబారినట్లు తలవంచుకుని కూర్చునేది. ఒకనాడు దినమణి స్నానం చేస్తున్నాడు. జాజి మల్లిపందిరివైపు చూస్తూ కండ్ల నీళ్లెట్టుకుంటూంది. దినమణి చూశాడు.

'ఎందుకే వెఱ్ఱిదానా! అలా విచారిస్తావూ?'

'బావా! చేసిన పాపం అనుభవిస్తేగాని పోతుందటోయ్?'

'నువ్వేం పాపం చేశావూ? పాపమేమిటి? ఆ దుర్మార్గుడి కాలా తోచింది. నీ గొంతు కోశాడు. ఆ వేళ మీనాన్నతో చెప్పి 'నేను బావనే పెళ్ళాడుతాను' అంటే మీనాన్న కాదని ఉండునా? నీకీ విచారం కలిగేదా?

'ఏం మాటలు బావా? నీవి. నాకర్మం యిలా వున్నప్పుడు నిన్ను పెళ్ళాడినా నీకూ పుడుతుంది మళ్ళీపెళ్లిబుద్ధి.'

'అలా యెప్పటికీ కాదే.'

'పోనిస్తూ బావా! నన్ను మరింత యేడిపించకూ.'

జాజి పుట్టినింట నున్న నెలదినాలున్ను జాజీ దినమణులు వెఱ్ఱివారివలె నుండేవారు. జాజి ఎప్పుడు చూచినా యేదో ఆలోచిస్తూనే ఉండేది. ఇంకా కొన్నాళ్లుండమని కాయమ్మ బ్రతిమాలుకున్నా వినక జాజి అత్తవారింటి కెళ్లిపోయింది.

ఇది జరిగిన ఆరునెలలకు ఒకనాడు కూలివాడొక ఉత్తరముతెచ్చి కాయమ్మకిచ్చాడు. అందిట్లున్నది: 'మీ మనవరాలికి యీ వేళకి తొమ్మిది లంఖణాలు. రాత్రి సంధిగుణం కనపడింది. మందు వేయిస్తున్నాము. దేవుడి దయవల్ల నెమ్మదిగా ఉండవచ్చును. వెంటనే రావలెను. వ. శ్యామమూర్తి వ్రాలు.'

ఉత్తరం చూడగానే కాయమ్మ నిలువునా కూలిపోయింది. వెంటనే బయలుదేరింది. దినమణి కూడా వెళ్లాడు; వారిద్దరూ వెళ్లేటప్పటికి జాజి చెరుపూ మరుపూ స్థితిలోవుంది. వచ్చినవారిని చూపి అక్కడున్నవారిలో ఒకరు రాజ్యలక్ష్మమ్మగారూ! ఎవరోవచ్చారు చూడండీ, వారెవరు? అన్నారు. జాజి నిదానించి చూచి 'మా అమ్మ' అంది. ఇంకొకరు ఆ నిలబడిన వారెవరో చూడమ్మా, అన్నారు. జాజి చూచింది. ఆమెకళ్లు నీళ్లతో నిండిపోయినయి. 'ఎవరమ్మా ఆ అబ్బాయీ?' అన్నారు ఇంకొకరు.

'ఎవరో' అంది జాజి, మొగం తిప్పుకుంది.

ఆ మరునాడు సాయంకాలం అయిదుగంటలకు దినమణి మణికట్టుమీద చెయ్యివేసుగుని జాజి శాశ్వతంగా కన్నుమూసింది. కాయమ్మకు లోకమంతా చీకటైంది.

దినమణి మనస్సులో తన జాజి చిన్ననాటి ప్రేమజ్యోతి అతని జీవితకాలమంతా వెలుగుతూనే ఉంది.



# భ్రమ

★

శ్రీ

మల్లవరపు
రామలింగం

★

(ఏకాంకిక)

## 1 వ రంగం

(కాలేజీ మైదానం. బాలభానుడు తూర్పుకొండలను మెల్లిగా ప్రాకుతూ ప్రపంచాన్ని బయలుపరుస్తుంటాడు. అప్పుడే ఆకాశంలో ఛేదించుకొని నిలబడివున్న క్లాక్‌టవరు 7 గంటలను చూపి, కాలేజీ విద్యార్థులను హెచ్చరిక చేస్తుంది. రామం, శివం అనే ఇద్దరు విద్యార్థులు లెవెలింగు పనిముట్లను మోస్తూ మైదానంవేపు వెడుతుంటారు.)

శివం :-(విసుగుతో) అబ్బబ్బా! రామం! ఇక నేమొయ్యలేనురా బాబు. ఆ లెక్చరరుగారు, చావనన్నా చచ్చాడుగాడు. మన కీబాధ వదిలిపోను.

రామం :-ఛ! ఛ! శుభమా అంటూ పెళ్లిచేసుకోబోతుంటే, అదేమిటిరా అలా అంటావు?

శివం :-ఏం పెళ్లో! వాడి పిండాకుడు. నా బుజాలు పడిపోతున్నాయి.

రామం :-అదుగో నిర్ణీతస్థలానికి వచ్చాం. ఇక నేను ఒక్కొక్క రీడింగు తీసుకుంటుంటాను, దాన్ని నీవు రికార్డు చేస్తోండు.

శివం :-(కొంతసేపైనమీద) త్వరగా కానీరా. ఒక్క రీడింగు తీసుకోటానికి ఇంతసేపా? సుమారు గంటన్నర నుండి బ్లింకు (Blink) చేస్తున్నావు.

రామం :-ఇక కట్టిపెట్టవోయ్! నీ తెలివితేటలకు నన్నేవిటిరా ఆక్షేపణ? నీ మొహం! ఎక్కడో బ్రహ్మ మానసపుత్రుడిలాగున్నావే. ఇదుగో చూడు నా సమర్థత [అంటూ రామం ప్రక్కనున్న మరో స్థలానికి స్టాఫ్‌తో గెంటుతూంటాడు. శివం వెంటనే వెడుతుంటాడు. కొంతదూరం సాగినతర్వాత రామం ఓ పలుగురాతిని తట్టుకొని బోర్లాపడిపోయి (ప్రక్కన పాముపుట్టొకటి వుండడంచూచి) 'చచ్చానురా! భవగంతుడా' అని వెఱ్ఱికేకేస్తాడు]

శివం :-ఏం! నిమిషానికి బాగావున్నావే!

రామం :-పాము! పాము!

శివం :-(ఆశ్చర్యంతో) ఎక్కడా?

రామం :-అదుగో పుట్టలోకళ్లింది. దాని తోక తొక్కేశానురా. పచ్చడైయుండాలి. పగ పట్టుతుందేమో కొంపదీసి.

శివం :-(నవ్వుతూ)! పగేంటి! ఎవరో తోకతొక్కడవూనూ, ఆ తొక్కినవానిని గుర్తుంచుకొని పగ సాధించడవూనా! సాధ్యమేనా! వెఱ్ఱివెంగళాయీ! ఎక్కడో అమ్మమ్మకథలు చెప్తావు.

రామం :-అమ్మమ్మ కథలు కాదోయ్! మా తాతయ్య చెప్పేవాడు చిన్నప్పుడు. ఎవరన్నా పాము తోక తొక్కలేనట, అది వాని కాలిజాడ ననుసరించి, అతనిని చంపేసేదాక నిద్రపోదట (అంటూ ఎగిరి శివం భుజాలను కరుచుకుంటాడు.)

శివం :-(గట్టి నిశ్వాసంతో) ఓయి బాబో! 180 పౌనుల రికార్డు బ్రేకు చేసావంటే ఆశ్చర్యం ఏం వుంది? అయితే ఇప్పుడేం చెయ్యమన్నావురా?

రామం :-(మొహంలో తత్తరపాటు చూపెడ్తూ) 10 గజాలు తీసుకెళ్లి వదిలేయి. అక్కడనుండి నీ మోస్తరే నడిచివస్తా.

శివం :-నీకేం నరవాహనం కావలెనా? నేను మొయ్యలేను బాబూ. ఏం ఇక్కడనుండి ఎందుకు నడువకూడదూ?

రామం :-ఇక్కడనుండే నడిస్తే అది సులభంగా జాడ పట్టేస్తుంది. కొంచెందూరం వెళ్ళామనుకో. అది దారి కనుక్కోలేక, తికమకపడి నామీద పగమానుతుంది.

శివం :-ఓహో అలానా! నీ తెలివికి మెచ్చుకొని కామాలు, సూర్యభగవానుడిలా మన బుర్రలను భగ్గున మాడ్చేస్తున్నాడు. సరే నా కీకర్మం తప్పేట్టులేదు (అంటూ రామాన్ని భుజానవేసుకొని వెడతాడు.)

## 2-వ రంగం

హాస్టలులో రామం గది. మధ్యాహ్న సమయం. రామం కవాటాలన్నీ బంధించేసి, మంచంమీద పడుకొనుంటాడు. ఇంతలో తలుపుచప్పుడు వినబడుతుంది.

రామం :-(లోపలినుండి) ఎవరది ప్లీజ్?

మళ్లా చప్పుడు.

రామం :-(తత్తర) వెళ్లండి! ఇక్కడెవ్వరూ లేరు.

మళ్లీ అదేమాదిరి చప్పుడు.

రామం :-(మండుతూ) మీకేనా చెప్పేది? తలుపులు తీయబడవు. రామారావుగది ఇదిగాదు. పక్కది, వెళ్లండి.

ఈ శబ్దానికి పక్కనున్న గోపాలరావు వచ్చి, తలుపులు తట్టుతున్న శివంతో 'ఏమండీ! శివరావు గారూ. ఏమిటీ గొడవ.'

శివం :-అబ్బే ఏమీలేదండి. మన రామానికి వళ్లు కొద్దిగా నీరసంగా వుంది. అంచేత అలా మాట్లాడుతున్నాడండి. రండి మనం కాలేజీకి వెడదాం. (వెళ్లిపోతారు)

## 3-వ రంగం

రాత్రి 8 గంటలు. రామం గది. ఆంధ్రా మెస్సులో శివం భోంచేసి, రామం రూముకు వచ్చేస్తాడు. ఇద్దరు సిగరెట్లను తగలేస్తూ బాతాఖానీ మొదలెడతారు. శివం కళ్లు ఒకప్రక్క అమర్చబడివున్న నూత్న వస్తు సముదాయంమీదికి ప్రసరిస్తాయి.

శివం :-(ఆశ్చర్యంతో) రామం! ఈ అంగడంతా ఏమిటీ?

రామం :-(తనుచేసినపని గొప్పదనే గర్వం ముఖంలో తొణికిస్తూ) అంగడేముందీ? చూడు! యీ బూటు ఏం దిట్టంగా వుందో! 6 రూపాయిలు పెట్టి తెచ్చా. తర్వాత యీ రగ్గు (Rug) చూశావా? ఎంత దళసరిగా వుందో. దీనిలో తల, కాళ్లు, జమాయించి పట్టి పడుకుంటే, ఆ పాము లోపలికెలా వస్తుందోయి? ఇలా చూడు! మధ్యాహ్నం అంతా కష్టపడి రూములో వుండే రంధ్రాలన్నీ పూడ్చేసి కట్టుదిట్టం చేసేశా!...(ఇలా భ్రమప్రవాహంలో పడి కొట్టుకవెడుతుంటాడు.)

శివం :-(ఆశ్చర్యం, కోపం, జాలి అభినయిస్తూ) ఓరి పిరికిపందా! ఇంకా అపాయము వస్తుందనేనా! నీ భయం? నీ ప్రాణాలకు నా ప్రాణం అడ్డుపెడ్తా అవసరంవస్తే. లేనిపోని ఇలాంటి పిచ్చి భ్రమలతో తారుమారవడం, మానవ వినాశానికి కారణం అవుతుంది. అసలు ఒక్క త్రాచుకే అలాంటి శక్తి వున్నదంటారు. అది యీ పరిసరాల్లో వుండడం అసంభవం, అలాంటప్పుడీ కోలాహలం ఏమిటి?

రామం :-కాని మన జాగ్రతలో మనం వుండడం మంచిదంటావా కాదా? జ్ఞాపకం వచ్చింది (వానిని తట్టుతూ) నీ వివాళ నా రూములోనే పడుకోవాలి, నాకు తోడుగా, ఏం?

శివం :-సరే అలాగే చేస్తా! ఇక నిద్రపో. 12 దాటింది (అంటూ వెళ్లి గాలి (Ventilation) కొరకు ఒక కిటికీ తలుపు తెరిచి, లైటు ఆర్పివేసివచ్చి తనుకూడా పండుకుంటాడు.)

రామం :-(వులిక్కిపడి, లేచి కూర్చొని) చంపేశావురా! అదుగో వస్తున్నాది. ముందు లైటు వెయ్యి. కిటికీ తలుపెందుకు తెరిచావు? ఏం! ఉక్కపోస్తోందా? ఉక్కపోస్తే ఫానెట్టి విసురుకో.—అంతేకాని నన్నడగకుండా, స్వతంత్రించి ఎవరు చెయ్యమన్నారిలాంటి అప్రయోజకపు పని? ఊ! మూసేయి త్వరగా? (శివం అలా చేసి వచ్చి పడుకుంటాడు.—రామానికి నిద్రపట్టదు. లేచి పడకమీదకూర్చొని, మంచానికి దిగువ నాలుగువేపులా వ్రేలాడే బెడ్ షీటును పైకి మడతపెడతాడు) 'ఆ! ఇంక ఎట్లా ఎక్కుతుంది పైకి? ఇపుడు హాయిగ్గా నిర్భయంగా నిద్రపోవచ్చు' (అంటూ పడకమీద పడుకుంటాడు. నిద్రలో ఇలా పాడ్తాడు):—

'పాము కరిసింది బలె పాము కరిసింది,
అట్టె నా ప్రాణాలు మింటికెగిరాయి
రచ్చించవోయి వో సరికొత్త తమ్ముడా!
రచ్చించరోయి వో విద్యార్థి బృందమా!'

అనే పాటను కలవరిస్తూ, పాల్లి క్రిందపడిపోతాడు. ఆ శబ్దానికి శివం (మేలుకొని):—

శివం :-రామం! ఇదేమిట్రోయ్! ఏమిటిలా కలవరిస్తున్నావు?

రామం :-(పక్కను పొల్లి) గ్లాసుతో మంచినీళ్లిలా యివ్వరా? (శివం అలా చేస్తాడు.)

రామం :-(తెప్పరిల్లి) దాని తస్సదియ్యా! అది కల్లోగూడా ప్రత్యక్షంరా. ఇలాగాకుండా, ఆ తలుపులన్నీ తీసేవున్నాయట—అది నిర్భయంగా నామీదికి దూకేసింది......(వణికిపోతుంటాడు.)

శివం :-ఛీ! ఎప్పుడొచ్చిందీ? నేనిక్కడే వున్నానా? ఇంక దాని బెంగ పెట్టుకోకు. పొద్దుకూకులూ అదేస్మరణ అయితే కల్లోకి రాక వూరుకుంటుందా? (వొళ్లు తాకి) వొళ్లంతా ఏమిటి! ఇలా మండిపోతోంది.

(ఒక్క పదినిమిషాలలో, శివం గదిముందు నిలుచొనివున్న డాక్టరుతో ప్రసంగిస్తుంటాడు. డాక్టరు 'మందుగాని, మాకుగాని, యీ కేసులో పనిచెయ్యవండీ!' అని వెళ్ళిపోతాడు. శివం కర్తవ్యం ఏమిటా అనే ప్రశ్నలో నిమగ్నుడై పొయ్యే డాక్టరువైపు చూస్తూ నిలబడిపోతాడు.)

## 4-వ రంగం

ఏటిపడ్డు. సంధ్యావేళ. పక్షులు గూళ్ళను చేరుకుంటూ చేసే కలకలారావాలు ప్రకృతివాయువుల్లో మిళితమౌతున్నాయి. పున్నమచంద్రుడు చల్లని పిండివెన్నెలలో రకరకాల ముగ్గులు పెడుతున్నాడు. పిల్ల వాయువులు ప్రక్కనవుండే పుష్పవనాల్లోనుంచి వస్తూ ఇసుకతిన్నెలను కౌగలించుకుంటున్నాయి. ఆ సమయాన ఇద్దరు వ్యక్తులు దూరానొక్క తిన్నెమీద కూర్చొనుంటారు. వారి తల లాకాశాన్ని చూస్తుంటాయి. అందులో ఒక వ్యక్తి ఇలా పాడ్తాడు.

భ్రమరయేలా! నీకు భ్రమరయేలా, జీవ భ్రమరయేలా!
ఆకాశమధ్యమున చందురుణ్ణి చూపి,
ఆనందవహ్నిలో ముంపవా, తార
లానందవహ్నిలో ముంపవా॥ భ్రమ॥

ప్రతి పుష్పగర్భమును చీల్చుకొని పరుగెత్తు
పిల్లగాడ్పులు మనల తనియింపవా, జీవ,
పిల్లగాడ్పులు మనల తనియింపవా—॥ భ్రమ॥

రెండవవ్యక్తి:-(సన్నకంఠంతో) శివం! ఇదంతా నిజమేనా?

(తెర)

---

## కనుగొంటి!

చిరుపాప చిరునగవు చిలికించు పలుకులో
నునులేత చిగురులో, నును నిగ్గు రుచులలో
సంజకెంజాయలో, చిరుచిలుక చిందులో
వేరాజు వాల్జూపు వేపసిడి తళుకులో
ఉదయభానుని రుచులు బురడించు లీలలో
కడుపార పాల్ త్రాపు తనయ లాలింపులో

కనుగొంటి కనుగొంటి
కనుగొంటి— నాసామి
కనుగొంటి కనుగొంటి
కళల కింపగువాని!

—శ్రీ దేవరకొండ లక్ష్మీనరసింహశాస్త్రి.



# బాలభాగ్యం

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

## పిన్ని ఉత్తరాలు

# పంజాబ్ రాష్ట్రము

సర్వమంగళా,

మన దేశంలో ఉన్న పెద్ద నదులన్నీ హిమవత్పర్వతాల్లోనే పుట్టేయని ఇదివరకుత్తరాల్లో వ్రాశాను. ఆనదు లన్నింటిలో గంగానది ముఖ్యమైనది. దాని తరువాత సింధునది. సింధునదికూడా చాలా పెద్దనదే. ఈనది ప్రవహించే భాగాన్ని రెండు రాష్ట్రాలుగా భాగించారు. మొదటిభాగాన్నే "పంజాబ్ రాష్ట్రం" అంటారు. రెండోభాగం సింధురాష్ట్రం. పంజాబ్ రాష్ట్రంలో సింధునదియొక్క ఉపనదులు అన్నీ ప్రవహిస్తున్నాయి. ఈ ఉపనదులు అయిదు. అయిదునదులదేశం గనుక ఈ రాష్ట్రానికి "పంజాబ్" అని పేరువచ్చినది. "పాంచ్" అంటే ఐదు. "అబ్" అంటే నీరు. పంజాబ్‌దేశంలో వర్షం అట్టే కురవదు. కాని నదులున్నాయికనక వాటిలోంచి కాలవలుతవ్వి నీరు తెచ్చుకుని పంటలు పండించు కుంటున్నారు.

పంజాబులో ముఖ్యంగా పండేపంట గోధుమలు. మన్నం తినే బియ్యపన్నంకంటే గోధుమలతో తయారుచేసిన ఆహారం చాలా మంచిది. పంజాబులో వాళ్ళంతా చాలా బలంగా ఉంటారు. వాళ్లు చాలా పరాక్రమం ఉన్నవాళ్లు. అందుకే పంజాబువాళ్లని పటాలంలో సిపాయిలుగా జేర్చుకుంటారు.

పంజాబ్‌దేశంలోనే "నానక్"అనే మత గురువు పుడత. నానక్ శిక్కుమతాన్ని కనిపెట్టేడు. ఈ మతాన్ని అవలంబించినవాళ్లని శిక్కులంటారు. శిక్కులకి తమమతం అంటే చాలా అభిమానం. తమ మతంకోసం వాళ్లు ప్రాణాల్నికూడా అర్పించడానికి సిద్ధపడతారు. శిక్కుజాతి ధైర్య సాహసాలకి పేరు పడ్డది. శిక్కులపేర్ల చివరున "సింగ్"అనే అక్షరాలు ఉంటాయి. "సింగ్" అంటే "సింహం" అన్నమాట. వీళ్లు సింహ పరాక్రములు గనకనే అలాంటిపేర్లు పెట్టుకోడం.

శిక్కులందరిలో పరాక్రమానికి ప్రసిద్ధికెక్కినరాజు రంజింత్‌సింగు. ఇతనికి "పంజాబ్‌కేసరి" అనే బిరుదు ఉండేది. "కేసరి" అంటే "సింహము" అని నీకు తెలుసు. రంజిత్‌సింగు శిక్కులందరికీ ఐకమత్యం కలుగచేసి గొప్పరాజ్యాన్ని స్థాపించాడు.

పంజాబు రాష్ట్రాన్ని గురించి చెప్పుకుంటూన్నప్పుడు, 'లజపతిరాయ్'అనే మహనీయుణ్ణి తల పెట్టకుండా ఉండడానికి వీల్లేదు. లజపతిరాయ్ అనే ఆయన ఒక గొప్ప దేశభక్తుడు. ఆయన ఇప్పుడు

లేదు. పోలీసువాడొకడు ఆయన గుండెమీద లాఠీపుచ్చుకొని కొట్టేడు. ఆదెబ్బవల్ల ఆయన కొద్దిరోజుల్లో మరణించాడు. దేశభక్తులు తమ ప్రాణాలని దేశంకోసం అర్పించడానికి వెనుదియ్యరు. దేశస్వాతంత్ర్యం కోసం బలిఐన వాళ్లల్లో లజపతిరాయిని ముందు చెప్పాలి.

ఇంకా కొంచెం పెద్దదానివయ్యాక నువ్వు మనదేశచరిత్ర చదవాలి. మనదేశంలోవాళ్లు ఒకప్పుడు ఎలా స్వతంత్రంగా ఉండేవారో, తరవాత పరాయిదేశాలవాళ్లు వచ్చి మన స్వాతంత్ర్యం ఎలా పోయిందో, ఇవన్నీ తెలుస్తాయి. పోయిన స్వాతంత్ర్యాన్ని తిరిగీ రప్పించుకోడానికే కాంగ్రెసువాళ్లు ప్రయత్నిస్తున్నారు. ఈ ప్రయత్నంలో దేశభక్తులంతాచేరి, బాధలకోర్చి పాటుపడుతున్నారు. తిలక్, చిత్తరంజనదాస్, లజపతిరాయ్ మొదలైన వాళ్లంతా ఈ ప్రయత్నంలోనే తమ ప్రాణాల్ని అర్పించారు; గాంధీ, నెహ్రూ మొదలైన వాళ్లంతా దేశంకోసం ప్రాణాల్ని అర్పించడానికి సిద్ధంగా ఉన్నారు. త్యాగంతో నిండిపోయిన వీళ్ల చరిత్రలన్నీ నువ్వు చదవాలి.

చెన్నపట్టణం,
1-7-41. } పిన్ని

# స్వీకారము

విమర్శనార్థము వచ్చిన ఈ క్రింది పుస్తకములను, పత్రికలను కృతజ్ఞతతో అందుకొంటిమి :—

అణాగ్రంథమాల ప్రచురణము 13—"నా తీర్థయాత్ర - ఎల్లోరా - అజంతా" శ్రీ అడవిబాపిరాజు.

దీపావళి (కక్ష, ఏటొడ్డు, కరువులో అధికమాసం, డైరెక్టరు అనే కథల సంపుటి.) చలసాని రామారాయ్ రచన. బెజవాడ, విజ్ఞానసాహిత్యవనం ప్రథమ కుసుమము.

ప్రారంభ విద్య: మే 25 సంచిక. వ్యవస్థాపకులు: ఈదర వేంకట్రావుగారు. సంపాదకులు: మంత్రిప్రెగడ మార్కండేయులుగారు.

'ప్రత్యూష' ప్రచురణం 5 'పాలవెల్లి' (11 కథల సంపుటము.) సికింద్రాబాదు సాధనసమితివారి ప్రకటన.

కలిసంతారణోపనిషత్తు, అహల్యాస్తవము. ఆంధ్రానువాదకుడు డాక్టరు పురాణపండ రామమూర్తి.

మాతృదేవతాస్మృతి: వక్కలంక శ్రీనివాసరావు బి. ఎ. ఆనర్సు.

తిరుత్తనీ తీర్థయాత్రాస్మృతి: జినపనీని వెంకటరాజు, బి. ఎ.

అణాగ్రంథమాల ప్రచురణము 14: మణిమేఖల: శ్రీమతి 'కవితిలక' పులవర్తి కమలావతీదేవి.

సర్వం విష్ణుమయం జగత్ (భగవంతుడు సర్వాంతర్యామి): శ్రీ వివేకానందస్వామి లండన్‌లో నొసగియుండిన మహోపన్యాసమునకు మాధవచైతన్య బ్రహ్మచారి ఆంధ్రానువాదము. శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు వారి ప్రచురణ.

బర్మా ఆంధ్ర సాహితీసమితి "వసంత కుసుమము". సంపాదకుడు, పలకా సూర్యనారాయణ.

హైదరాబాదు సమాచారము. సంపు. 1, సంచిక 1. మే 41. నిజాం ప్రభుత్వ ప్రకటనశాఖ వారిచే ప్రకటితము.




## కనులు

కనులు విశాలమై, సోగగా మిట్టప్రదేశముపై యుండి చక్కని నలుపురంగుగల గ్రుడ్డుచుట్టును తెలుపు గలిగియున్న అందముగా యుండును. ఇట్లుండుటకు సర్వవిధముల ప్రయత్నించుట యవసరము. మసకగాయుండు వెలుతురులో చదువుటగాని, వేరొకపని చేయుటగాని చేయు కీడు కనులకు మరేదియును చేయదు. చదువునపుడు వెలుతురు వెనుకనుండి పుస్తకముపై పడునట్లు చూడుము. మిక్కిలి కాంతివంతముగ నున్న దీపములనుగాని, సూర్యునిగాని నిదానించి చూడకుము. దుమ్ముతో నిండియుండు ప్రదేశమున హెచ్చు కాలము నిలచియుండకుము. కంటికి పుగాకు రసము మొదలగు ఘాటైన ఔషధముల నే సమయమునగాని వాడకుము. కనులు నీరసముగా యున్నట్లు తోచినపుడు బహు పలుచని తేనీటితో వానిని కడిగిన బలము చేకూరును. వేడి వస్తువులు తినుట కలవాటుపడినను, త్రాగుడు కలవాటుపడినను, కోపస్వభావము కలిగి యున్నను కంటియందలి తెలుపు నశించును గాన ఆ యలవాట్లు తగ్గించుకొనుము. తరచు విచారముతో కన్నీరు కారిన కనులకాంతి చెడును. పచ్చని శరీరము గలవారు కనులకు అడుగురెప్ప పైభాగమున పాతిక అంగుళము వెడల్పున కొంచము సుర్మాపొడిగాని, లేక నీలిపొడిగాని, లేక నల్లని యే యితరపొడిగాని యద్దినచో కనుల కాంతి యినుమడించి అందమిచ్చును.

చురుకైన చూపులలో అందము కలదు. కనుల కట్టి చురుకుదనము వచ్చుటకై పరిశ్రమ చేయదగును. ఒక గోడకు మధ్యభాగమున నిడివిగా నిలువుము. తల వెనుకభాగమును గోడ కాననీయుము. అట్లానుకొనిన తలను పరిశ్రమ పూర్తియగువరకు కదలనీయకుము. మొదట నీకుడిభుజమును చూడ ప్రయత్నింపుము. తరువాత ఎడమభుజమును చూడ ప్రయత్నింపుము. ఇట్లు కొన్నిసార్లయిన తర్వాత నీ కను పైరెప్పల చూడ ప్రయత్నింపుము. తరువాత క్రిందిరెప్పల చూడ ప్రయత్నింపుము. ఇట్లు మరికొన్నిసార్లు చేయుము. తరువాత కుడిభుజము, దిగువరెప్ప, ఎడమభుజము, ఎడమచెవి పైభాగము, పైరెప్ప, కుడిచెవి పైభాగము, కుడిభుజము వరుసగా నెమ్మదిగా చూడ ప్రయత్నింపుము. అవి నీకు కనపడకపోయినను వాటి తావునకు నీ దృష్టి పోనిమ్ము. ఇదేవిధముగా దీనికి వ్యతిరేకమార్గముగ కూడ కండ్లను త్రిప్పుము. ఒక వారము దినములలో మిక్కిలి వేగముగా, సులువుగా త్రిప్పుట చేతనగును. ఇట్లు కొన్నివారములు చేసినచో కనులకు కాంతి, చూపులలో చురుకుదనము కలుగును.

కనుబొమలు దట్టముగా నున్నచో ప్రేళ్ల కొనలు వానిపైనుంచి కనుల కొనలకు యదిమి లాగుము. వెంట్రుకలు ఒదిగియుండి కావలసిన వంకరతో యణగియుండును. కనుబొమలు అందమయిన వంకరకలిగి యుండక ప్రక్కన కొన్ని వెంట్రుకలున్నచో వానిని తంటసముతో లాగించివేయుము. లేదా ఎలెక్ట్రిసిటీతో నాశనమొనర్చుము. కత్తి నెన్నడును వాడకుము. కనుబొమలు పలుచగా యున్నచో సన్నని కత్తిరితో జాగ్రత్తగా, చివళ్లు బహుస్వల్పముగా కత్తిరించుము. వెంట్రుకలు మొదుగుబారి యందమిచ్చును. రాత్రులందు తలనూనెనుగాని వేసలైనునుగాని కనుబొమలకు రుద్దుము.

## చెక్కిళ్లు

అందమయిన చెక్కిళ్లను చెక్కుటద్దములని మన కవులు వర్ణించుట వాడుక. చెక్కిళ్లు ఎత్తుగాగాని, చొట్టబోయిగాని యుండక కాంతివంతమై యున్నచో యవి చెక్కుటద్దములే. కొంచమెత్తుగానున్న చెక్కిళ్లు స్ఫూలకాయులకు అందమిచ్చును. కాని చొట్టబడిన చెక్కిళ్లు నిజముగ యందమును చెఱచును. అట్టివానిని చన్నీటితో తడిపి, ఆతడి యారకుండునట్లు మరల మరల తడుపుచు మెత్తని తువాలుతో చొట్టపడిన భాగముపై గుండ్రముగా కొంచమెక్కువ యొత్తిడితో రుద్దుము. ఇట్లు రుద్దుటచే చర్మమున కడుగున గల కంధరముల కొత్తిడి తగులవలెను. ఇట్లు రుద్దుటవలన యా కండరములకు క్రొత్త నెత్తురు చేకూరి దేహమునకు పటుత్వము వచ్చును. ఈ విధానము చాలవరకు సంతృప్తికరముగ పనిచేయును. •

వయసు ముదిరినవారికి చెక్కిళ్లు గుంటపడి యందము నవహరించినచో పడుచువారికి మొటిమెలు బయలుదేరి చెక్కిళ్ల నందవిహీనముగ జేయును. ఈ మొటిమెలు చర్మరోగమువలన గలుగును. అవి పెద్దవై కొనదేలకుండు సమయమున యందలి తెల్లని పదార్థమును మొటిమెపై నొక్కి యొత్తిడి కలిగించి బయల్వరుప జూచుట హానిదాయకము. అందువలన నొకొ్కక్క సమయమున యా భాగము గడ్డకట్టి యెఱ్ఱనై, తరువాత నల్లబారి చాలకాలమువరకు యందమును చెరచునదియై నిలచియుండును. గరికపై మంచు రాసినచో మొటిమెలు పోవునని కొందరి యభిప్రాయము. సీసాల నమ్ముడుపోవు స్నో రాసినను యవి తగ్గవు. గంధక పూలరస మొకతులము, గులాబిపూలరస మొకతులము, గ్లిసరిను ఒక తులము యీ మూటిని బాగుగ కలిపి రాసినచో గుణమిచ్చును. మందుల షాపునుండి పదార్థముల సులభముగ కొనితేగలుగువా రీ క్రింది మందు చేసికొన నగును. అమ్మోనియా ద్రవము 20 చుక్కలు, ఒక డ్రాము యీథరు, సబ్బుపొడి ఒక ఔన్సు, వీటిని బాగుగ మర్దించి వ్రేలితో మొటిమెలపై కొంచముసేపు రుద్ది వేడినీటితో కడిగివేయుము. మొటిమెలు గలవారు టీ గాని, కాఫీ గాని, మద్యముగాని సేవింపరాదు. ఓవల్టిను, కోకో, పాలు త్రాగవచ్చును. వేపుడులు, నూనె, మాంసపదార్థములు విడనాడనగును. హెచ్చుగా పండ్లు, కూరగాయలు తిననగును. సాయం సమయమున ముఖమున కావిరిస్నానము నిచ్చి కొంచము యుడికలోను రాసి నిదురించుట మంచిది.

(సశేషము)

—శ్రీ అలంపురం రాజు, బి. ఏ.




గోధుమలతో తయారుచేయదగిన వివిధ పదార్థములు—12.

## బొంబాయి తేంతోళ

రెండు ఆళాకులు గోధుమపిండి, రెండు ఆళాకులు పచ్చిపిండి, నీళ్లు అరపడి మసలపెట్టి రెండు పిండ్లూ కలియపోసి కలుపుకొని తేంతోళపీటలో పిండేది.

## సెనిగపిండి అల్వా

రెండు ఆళాకుల శెనగపిండి, ఆళాకు గోధుమపిండి, ఆళాకు పచ్చిపిండి, 10 పలాలు నెయ్యి కాగనిచ్చి మూడు పిండ్లూ కలిపి బంగారు వర్ణముగా వేయించుకుని పాలు నీళ్లుపోసి పొరటేది. బాగా ఉడికినతర్వాత తగుమాత్రం చక్కెరచేర్చి కొంత ఏలకపొడి, జీడిపప్పు, కుంకుమపువ్వు వేసి కలబెట్టి దింపవలెను.

—ఎం. ఎతిరాజమ్మ.

## అక్బరుపా

ఆళాకు గోధుమపిండిని, ఆళాకు శనగపిండిని వేరువేరుగా యెఱ్ఱగావచ్చువరకు వేయించి ఉంచుకొనవలెను. ¼ వీశ నీళ్ళలో నానిన బాదముపలుకులను ఒలిచి, మెత్తగారుబ్బి శుభ్రమైనగుడ్డతో వడకట్టి పాలు పిండుకొని, ఆ పాలలో పంచదారకలిపి తీగెపాకము వచ్చువరకు కాచి కలియబెట్టుచు, నానబెట్టిన కేసరిపొడిని అందు కలుపవలెను. తరువాత కొబ్బరికోరు, వేయించిన గోధుమపిండి, శనగపిండి, జీడిపప్పు, ద్రాక్షపండు, వీనినివేసి బాగుగా ముద్ద అగువరకుకలిపి నేయిరాచియుంచిన పళ్లెములో యీ ముద్దనుపైచి పలుచగా తట్టవలెను. చల్లారినతర్వాత కత్తితో బిళ్లలుగా కోయవలెను.

## ఇంగ్లీషు కేకు

వెన్న తగుమాత్రంవేసి 2 ఆళాకుల గోధుమపిండిని కలుపవలెను. తరువాత కొద్దిగా పంచదారనుచేర్చి కలియపిసికి కేకులు తయారుచేసి వెన్నపూసిన టిన్ను కేకు అచ్చులలోపెట్టి ఓ గొట్టెల పొయ్యిలో కాల్చవలెను.

# గోధుమ షర్బతు

¼ శేరు గోధుమలను, 15 పలములు బాదముపప్పును వేరువేరుగా రాత్రి నీళ్ళలో నానబెట్టి మరుచటి ఉదయమున వానిని వేరువేరుగా రుబ్బి పాలుతీసి వడకట్టి ఈ రెంటిని 1½ పడి నీళ్ళలో కలిపి అందు 20 పలములు పంచదారచేర్చి నీళ్లు యింకునట్లు పాకముపట్టి దానిలో కుంకుమపువ్వు, ఏలకులచూర్ణము, ఎస్సెన్సుకలిపి దించి చల్లారనిచ్చి సీసాలోపోసి ఉపయోగించవలెను.

# ఆవిరి రొట్టె

విసిరిన గోధుమపిండి ¼ శేరు, కొద్దివెన్న, కొబ్బరి ముక్కలు, నీళ్లలో కరిగించిన ఉప్పు—వీనిని కలిపి వేడినీళ్ళతో పావు గంటవరకు బాగుగ మర్దించి పెద్ద ఉండచేసి గిన్నెలోనుంచి మూతవేయవలెను. కొంతసేపైన తర్వాత ఆ ముద్దను రొట్టెలువలె తట్టి, ఆవిరిపెట్టెలోనుండు పెనమునకు నేయిరాచి దానిపై రొట్టెనుంచి మూతవేసి కుంపటి నిప్పులమీదనుంచిన యెక్కువ సెగ యుండదు కనుక-కొంతసేపటికి రొట్టె పక్వముగాకాలి తినుటకు రుచిగానుండును.

—కె. మహాలక్ష్మీదేవి.

# రసనామృత వుండలు

1 పలము నేతిలో ½ శేరు గోధుమరవను వేయించి ½తులము కుంకుమపువ్వును 2 పలముల చక్కెరను 1 పలము మీగడ 2 పలములపాలు వేసి కలిపి నానినతర్వాత దించి వుసిరికాయలంత వుండలుచేసి 1 కొత్త కుండతెచ్చి దానిలో 2 పలములనెయ్యి 2 పలముల చక్కెర 2 పలముల పాలుపోసి ఈ వుండలువేసి మూతబెట్టి సన్నని గుడ్డపేలిక మూతకుచుట్టి ఎఱ్ఱమన్ను పూయవలెను. దానిని పిడకలదాలిలో ½ గంటవరకు కాల్చవలెను. మంట నాలుగువైపుల సమముగానుండునట్లు చూడవలయును.

—కోకా శ్రీలక్ష్మమ్మ.

## రచయితలకు బహుమానము

గోధుమ ధాన్యముతో తయారుచేయదగిన పదార్థముల పట్టిక ఇంతటితో ముగింపుచేయబడినది. రచయితలకు బహుమానమెప్పుడు యొసంగబడునను విషయము వెనుకనుంచి తెలియపరచబడును. కాన గమనింప గోరుచున్నాము.

# స్త్రీ స్వాతంత్ర్యము

శ్రీ రావి నారాయణరెడ్డి

"జనసంఖ్యలోని అర్ధభాగమగు స్త్రీలందరును వెనుకబడియుండి విద్యావిహీనులై అజ్ఞానులైయున్నప్పుడు మనరాష్ట్రము అభివృద్ధిగాంచజాలదు. తల్లులయందు ధైర్య నిపుణతలేనిదే ఆగుణములు సంతానమున కలవడవు. భారతదేశమునందేమి, ఇతర దేశములయందేమి మొత్తముమీద మానవసమాజమునందు స్త్రీలు మిగుల దుస్థితికి పాల్పడియున్నారు. మన నాగరికత, శాస్త్రములు, ఆచారములు, చట్టములు అన్నియు పురుషునిచేతనే గావింపబడినవి. పురుషుడు స్వార్థపరుడై సంఘమునందున్నత స్థానము నాక్రమించుకొని స్త్రీని ఒక వినోదవస్తువుగ పరిగణించి తన సౌఖ్య సంతోషలాభములకై వినియోగించుకొనుచున్నాడు. పురుషుని అధికారమునకు లోబడిపోవుటచేతను, సంఘమునందలి అవకాశములు పురుషునితో సమానముగా ఆమెకు లభింపజాలకపోయినందున ఆమె వెనుకబడియున్నదను నేరము పురుషుడే ఆమెపై మోపెను.

పాశ్చాత్య దేశమునందలి స్త్రీలు మెల్లమెల్లగా కొంత స్వాతంత్ర్యము బొందుటయందు విజయవంతులైరి. మనదేశమునందలి నారీమణులు ఈయుద్ధ పరిస్థితులయందు పాశ్చాత్యస్త్రీలనుండి ఎన్నియో విషయములు నేర్చుకోవలసియున్నది. పురుషులతోబాటు వీరాంగనలు కొందఱు రణరంగములకరిగి ధైర్యోత్సాహములతో యుద్ధము చేయుచున్నారు. తమ భర్తలను, పుత్రులను సంతోషముతో రణరంగముల కంపి వారిదివరకు వహించియున్న బాధ్యతయంతయు తామే వహించుచున్నారు. రణరంగమునందు చీనా స్వాతంత్ర్యసాధనకై ఆదేశపు సోదరీమణులు జూపుచున్న ధైర్యసాహసములు, అత్యంతాశ్చర్యకరముగానున్నవి.

స్త్రీల విద్యావిధానము పురుషులకంటె వేరుగా నుండవలయుననియు, పురుషులు అభ్యసించు విద్యకంటె స్త్రీ లభ్యసించు విద్య భేదముగా నుండవలెననియు కొందరి అభిప్రాయమైయున్నది. ఆమె విద్యావిధానము ఆమెను గృహకృత్యములకును, స్త్రీ లందరిచేతను ఆచరణయందుంచబడుచున్న "వివాహ" మను వృత్తికిని సిద్ధముజేయుటయే వీరి ఉద్దేశము. స్త్రీవిద్యయొక్క ఇట్టి సంకుచితమైనట్టియు, పక్షపాతమైనట్టియు దృక్పథముతో నేనేకీభవించజాలను. స్త్రీలకు సంఘమునందన్ని శాఖలయందును అత్యున్నతమైన విద్య నభ్యసింపజేయుటయేగాక సర్వవృత్తులయందును, సర్వావస్థలయందును తమ కర్తవ్యములను జయప్రదముగా నొనర్చునందులకు శిక్షణ మొసంగబడవలయును. స్వాతంత్ర్యము ఇతర పరిస్థితులన్నిటికంటెను ఆర్థిక పరిస్థితుల మీదనే ఆధారపడియుండును. స్వతంత్రార్జనలేక ఆర్థికముగా స్వతంత్రురాలుగాని స్త్రీ ఆమె భర్తపైననో, లేక మఱొకరిపైననో ఆధారపడియుండవలసివచ్చును. ఆర్థికముగా నొకరిపై ఆధారపడువారు స్వతంత్రులుకాజాలరు. స్త్రీ పురుషులకుండు సంబంధము ఒకరిపైనొకరు ఆధారపడని సంపూర్ణస్వాతంత్ర్య స్నేహములతో గూడుకొని యుండవలయును.

నిజాంరాష్ట్రాంధ్ర సోదరీమణులు స్త్రీ ఉద్యమముల యెడలను, ప్రజాఉద్యమముల పక్షమునను తమ కర్తవ్యము నెరవేర్పవలయును. వారు అనారోగ్యకరములగు సంఘకనుమలలో నుండక, పర్వతారోహణ శక్తిని కలుగజేసికోవలయును. సంఘ దురాచారములతో పోరాడవలయును. స్త్రీల అభివృద్ధి నిరోధకమగు పర్దాను తుత్తునియలగావించి, ముక్కలను భగ్గముచేసి వేయవలయును. నేడు సంఘవిచ్ఛిన్నతకు కారణములగుచున్న మతపాక్షికములు, కులభేదములు, అస్పృశ్యత మొదలగువానిని ప్రతిఘటించి అంత మొందింపవలయును. మంచివిద్య, వ్యాయామములను బడయవలయును."

(* నిజాంరాష్ట్ర అష్టమాంధ్ర మహాసభాధ్యక్షోపన్యాసములో నుండి).

# ★ నక్షత్ర ఫలితాలు

కవికలహంసి
శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి

## ● ఆషాఢ మాసము ●

**అశ్వని**
కార్యసిద్ధి; ధాన్యనాశం; ఆలోచనలు

**భరణి**
నల్ల ధాన్యములలో లాభం; అజీర్తి; ఆలస్యం

**కృత్తిక**
రక్త విరేచనం; ఎఱ్ఱ లోహములో లాభం; విచారం

**రోహిణి**
కార్యవిజయం; గ్రామాంతరవాసం; వివేకం

**మృగశిర**
క్రొత్త వ్యాపారం; ప్రభుదర్శనం; శుభవ్యయం

**ఆర్ద్ర**
సోదరవృద్ధి; శ్వేతవస్తులాభం; సంచారం

**పునర్వసు**
సుగంధవస్తువులలో నష్టం; ధనమానహాని; భీతి

**పుష్యమి**
జ్వరం; వ్యసనకరవాక్యము వినుట, కష్టము

**ఆశ్లేష**
భూలాభం; వ్యాకులత; పరగృహవాసం

**మఖ**
పుత్రులచే దుఃఖం; నూత్న స్నేహం; విరోధం

**పుబ్బ**
నిర్వ్యాపారం; సాహసం; చతుష్పదజంతు భయం

**ఉత్తర**
రక్తపిత్తం; రాజభయం; కోర్టు వ్యవహారం

**హస్త**
సద్గోష్ఠి; వస్త్రలాభం; ఋణబాధ

**చిత్త**
యశోవృద్ధి; తేజస్సు; పుత్రులచే సంతోషం

**స్వాతి**
సౌభాగ్యం; వినోదక్రీడ; తల్లికిసౌఖ్యం

**విశాఖ**
గోవును కొనుట; సంగీతగోష్ఠి; ప్రయాణం

**అనూరాధ**
రాజకోపం; ఉపన్యాసం; ఆరోగ్యం

**జ్యేష్ఠ**
ప్రయాణములో లాభం; ఉష్ణజ్వరం; వ్యయం

**మూల**
అర్థలాభం; చోరభయం; ఉద్వేగం

**పూర్వాషాఢ**
విద్యాభంగం; బంధుదూరం; చంచలం

**ఉత్తరాభాద్ర**
భయం; నానావిధ చిక్కులు; కృషివిఘ్నం

**శ్రవణం**
బంధుసమాగమం; స్వల్పాధికారం; ద్వేషం

**ధనిష్ఠ**
ఐశ్వర్యం; రాజభోజనం; సంగ్రామం

**శతభిషం**
శైత్యజ్వరం; వృత్తిహాని; అనుమానం

**పూర్వాభాద్ర**
భోగం; ఉల్లాసం; మిత్రసమాగమం

**ఉత్తరాషాఢ**
రాచకార్యం; విమానయాత్ర; కీర్తి

**రేవతి**
శరీరారోగ్యం; వ్యవహారవిజయం; సద్వ్యయం

# ★ స్త్రీ సాముద్రిక శాస్త్రము ★

కవికలహంసి, శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి

( గతసంచిక తరువాయి )



దీర్ఘములై, సూక్ష్మములై పలుచగానున్న గోరు పిరికితనమును, అపకీర్తిని, విరసమగు నడవడికను సూచించును.

Note: గోళ్లమీద తెల్లని చుక్కలు అనుభవములో పైచెప్పిన దానికి విరుద్ధముగా నున్నది. ఈ చుక్కలు సాధారణముగా రక్తాధిక్యతగల నఖములందే పొడగట్టుచున్నది. ఇది తాత్కాలికముగ పుట్టి కొన్ని రోజులకు మాయమగుచుండును. ఇవి త్వరలో రానున్న అదృష్టమును దెల్పును. ఏ వ్రేలిగోరుపైనున్న యా వ్రేలినిబట్టి ఫలితములు నిర్ణయింపవలెను.

ఈ చుక్కలు చూపుడువ్రేలిపై నున్నచో మిత్రలాభమును, అధికారుల మన్ననలను సూచించును.

మధ్యవ్రేలిగోరైన—వాణిజ్యాభివృద్ధిని ధనలాభమును.

ఉంగరపువ్రేలైన—ఖ్యాతిని, పరీక్షలలో ఉత్తీర్ణతను, మనస్థిమితమును.

చిటికినవ్రేలైన—వర్తకములో లాభమును, కార్యసాఫల్యతను.

బొటనవ్రేలైన—మనోరథసిద్ధిని, నూత్న వస్త్రలాభమును, సూచించును.

నల్లనిమచ్చలు, నీలిమచ్చలు పైవానికి విరుద్ధ ఫలితములను, రసవిష దోషములును సూచించును.

## అఱచేయి

అరచేయి దళమై, పొట్టుగా నుండిన అజ్ఞానము, మందాలోచన, మూఢవిశ్వాసము వీటిని తెలుపును.

దళము, కఠినము—పనులలో నేర్పు, ఓర్పు. దళము, మిక్కిలి కఠినము—మృగస్వభావము, తమోగుణము, మాఢ్యము.

దళము, కాంతివంతము, మృదువు—భోగము, సుకుమారత్వము, సద్భావములు.

దళము, మిక్కిలి కోమలము—దుర్వ్యసనములు, అసూయ, స్వార్థపరత్వము, సోమరితనము.

పలుచన, కఠినము—చులుకుదనము, చమత్కారము, ఓర్పు.

పలుచన, అతికఠినము—నిర్దాక్షిణ్యం, దురాశ, స్వార్థపరత్వము, రజోగుణము.

పలుచన, కుఱుచ—అత్యాశ, స్వల్పజ్ఞానము, మందబుద్ధి.

పలుచన, కోమలము—చతురత, భావోద్రేకము, సౌఖ్యేచ్ఛ.

పలుచన, మిక్కిలి కోమలము—కపటం, దుర్మార్గము, నీరసము.

ఈ హస్తము మంచి లక్షణములతో నుండిన కవిత్వము, పారమార్థిక బుద్ధి.

అరచేయి చదరముగానుండిన చులుకుదనము, చతురత, సాధు స్వభావము.

చెండువంటి అరచేయి—ఉత్సాహము, కుశాగ్రబుద్ధి.

వెనుకకు వంగునట్టి స్వభావముగల చేయి ప్రశస్తమైన గుణములు, అన్ని కార్యములలోను మంచి సమర్థతను సూచించును.




## స్త్రీల హక్కులు

హిందూ లా కమిటీవారి ప్రశ్నావళిపై అఖిలభారత మహిళా మహాసభ స్థాయిసంఘమువారు జారీచేసిన ప్రకటనలో కొన్ని నిరాక్షేపణీయమగు అభిప్రాయములు ఖచ్చితముగ తెలుపబడినవి. స్త్రీలు పొందదగియున్న అన్ని హక్కులను వారికి చేకూర్చునట్టి సువిశాల శాసననిర్మాణమొకటి వారు కోరిన వాటిలో ముఖ్యాంశముగ నున్నది. సమగ్రమయిన సంస్కరణముతో కూడిన శాసనములు లేక, కొసరి కొసరి అప్పటప్పట ఒక్కొక చట్టమే చేయుటవలన చాల కష్టము కలిగినది గాని స్త్రీల స్థితియందెట్టి సర్వతోముఖమయిన అభివృద్ధియు కలుగకుండినది.

బహుభార్యాత్వమును నిషేధించుటో శిక్షార్హముచేయుటో అవసరమని మహిళామణులు కోరిరి. తప్పని సరియైన సహేతుకమైన సందర్భములలో స్త్రీలు తమ భర్తలకు విడాకులిచ్చు హక్కును గుర్తించు చట్టముకూడ అవసరమనిరి. అయినను, ఈ హిందూ నారీమణులు వివాహ పావిత్ర్యమును గుర్తెరుగనివారు కారు. కాని, వివాహవిధుల బాధ్యతలన్నియు ఒక్క స్త్రీలు మాత్రమే పాటించవలసినవారు కారనియు, పురుషులతోడి సమానహక్కు స్వత్వములు తమకును ఉన్నవనియే వీరి వాదన. భర్తలు భార్యలను వదిలివేసి వారిని దిక్కులేనివారినిగ జేయుట పూర్వముకంటె యిప్పుడు అధికసంఖ్యాకముగ జరుగుచున్న శోచనీయ సంఘటనమని అందరు నెరుంగుదురు. బహుభార్యాత్వము తొలగిపోవలసియున్నది.

వివాహమున వధూవరు లిరువురి స్పష్టమైన అంగీకార ఆమోదములు అత్యవసరము. విధిలేని సందర్భములయందు స్పష్టమైన కారణములున్నప్పుడు వివాహము రద్దుచేసుకొనుటకు అనుమతి కోరుచున్నారు.

హిందూస్త్రీలకు వివాహబంధమునందు అత్యంతాధికమగు గౌరవమున్నది. ఆధునిక విద్యాభ్యాసమువలన భారత నారీమణుల హిందూ సాంప్రదాయ శీలములు గోలుపోవునవి కావు. కోర్టుద్వారా భార్యాభర్తలు విచ్ఛిత్తి బడయుట వారికినీ ఏహ్యమైన విషయమే. అందువలన విడాకుల చట్టము ఏర్పడినంత మాత్రమున అనేక గృహములు కూలిపోవునను భయముగాని అనుమానముగాని పడవలసిన అవసరము లేదు. న్యాయశాస్త్రప్రకారము విడాకులహక్కు అవకాశము లేకున్నను విడిపోయిన భార్యాభర్తలు ఉందురు. కాని న్యాయచట్టముద్వారా విడాకుల హక్కు ఏర్పడినచో, నిజముగా విపరీత కష్టనష్టములకు లోనైయున్న సందర్భములలో స్త్రీలకు సదుపాయము జరుగగలదు. పురుషులతోపాటు స్త్రీలకును సమానమగు హోదా (ప్రతిపత్తి)యును సమానావకాశములును సమాన హక్కులును ఒసంగు న్యాయ చట్టములు శాసనములు గావింపబడవలయునని ప్రజాభిప్రాయము బలీయమగుచున్నదను సంగతి గమనింపదగును.

ఈ సందర్భమున, హిందూ లా విధానమంతటిని సమగ్రముగ పరిచూచి సవరణచేయించుటకు ప్రవీణులగు న్యాయవాదుల దిట్టమైన సంఘమొకటి నియమింపబడవలయునను అభిప్రాయమును మేమును బలపరతుము.